బాలానంద

# జై వీర హనుమాన్

(తులసీదాస్ - హనుమాన్ చాలీసా)



శ్రీ ధూళిపాళ రామమూర్తి



నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ ........................ విజయవాడ-2

# విషయసూచిక

శ్రీ మహా గణాధిపతయే నమః

# జై వీర హనుమాన్

[శ్రీ తులసీదాసు – హనుమాన్ చాలీసా]

శ్రీహరి దయావిశేషముచే భారతదేశము కర్మభూమిగా పేరందినది. ఇచట మహానుభావులు, విజ్ఞానవేత్తలు, భక్తులు, మహామునులు, త్యాగధనులు పెక్కుమంది జన్మించి వారి పవిత్ర పాదరఖములతో యీ భారత భూమిని యింకను యెక్కువ వన్నెకు తీసికొని వచ్చినది. గంగా, యమునా, సరస్వతులు, వాటి సంగమప్రదేశము నర్మదా, తపతీ, గోదావరి, కృష్ణా, కావేరి మొదలగు మహానదులిందు ప్రవహించుచున్నవి. ఇందుకు మహాధన్యులు భక్తాగ్రేసరులు పెక్కుమంది జీవితములన్నియు దైవపరముగా త్యాగములు చేయుచు నారాయణుని దర్శనమందుచు నడచినవే! ఇందు మహావనములు, పర్వతములు పుణ్యాశ్రమముల వికాసముగా తత్త్వబోధలకు, భక్తిపారవశ్యమునకు తోడుపడుచున్నది. ఇందుత్తర భారతములో ప్రపంచ ఖ్యాతినందిన గంగానది ప్రవహించుచున్నది. ఈ గంగానది గంగోత్రివద్ద పుట్టినది. హిమాలయ పర్వతారణ్యములలో పది పదిహేనుమైళ్ళ దూరము దట్టమగు నోషధులతోనిండిన ప్రదేశములో ప్రవహించుచు గంగోత్రివద్ద బయటకు వచ్చినది.

అక్కడనుండి హిమాలయ పర్వతమధ్యమునుండి నురకలమీద దాటులు దాటుచు క్రమముగా సమప్రదేశముగా చెప్పబడు "హరిద్వార"మను మహాక్షేత్రమునకువచ్చి యచటనుండి తన ప్రవాహము సమతలములో సాపుగా నడచునట్లు సాగుచున్నది క్రమముగా ప్రయాగ క్షేత్రముదాటి కాశీ క్షేత్రము మీదుగా కొన్ని మహాక్షేత్రములు పునీతము చేయుచు సముద్రములో గలియుచున్నది. ఇట్లు సమతలమున ప్రవహించి గంగానదీ తీరము పొడుగునా గ్రామములు, పట్టణములు, మహాక్షేత్రములు గలవు. పూర్వకాలము నుండి పుణ్యాత్ములకు వాసయోగ్యమగు బ్రాహ్మణాగ్రహారములుండెను.

అట్టి గ్రామములలో వేదములు, శాస్త్రములు చదివి యతిధి యభ్యాగతుల నాదరించు వారలుగా బ్రాహ్మణుల కుటుంబములుండెను. అట్టి కుటుంబములున్న గ్రామముగా పేరందినది. యొకగ్రామము గంగాతీర ప్రాంతములో నుండినది. ఆ గ్రామములో నొకబ్రాహ్మణ కుటుంబమువారు కాపురముండిరి. ఆ కుటుంబమునకు యజమానిగా ధర్మవేత్తయగు పుణ్యాత్ముడు సంచరించుచుండెను. ఆయనకు పూర్వ పుణ్యవశమున చక్కని కుమారుడు శుభలగ్నమందు జన్మించెను. ఆ కుమారుని చూచి కుటుంబములోని వారందరూ పరమానందమందిరి. పుట్టిన తరువాత పురిటి శుద్ధిరోజున పురిటి స్నానము తల్లికి పిల్లవానికి చేయించిరి. తరువాత విద్యావంతులగు గ్రామవాసులగు బ్రాహ్మణులను పిలిపించి తన కుమారునకు జన్మోత్సవము గావించిరి. నామకరణము సమయములో నా పిల్లవానికి "తులసి" యను నామముంచిరి. ఆ పిల్లవానిని తల్లితండ్రులు ప్రేమగా గారాబముగా పెంచసాగిరి. ఆబాలుడు తనయిల్లు పరమశ్రోత్రియుల

గృహమగుటచే మంచి యభ్యాసములుగల్గి బాలుని తీర్చిదిద్దుచుండిరి. తల్లి మహాభక్తురాలు. తన కుమారుడు పెరిగి పెద్దవాడైన గొప్పవానిగా తయారు కావలయునను కోరికతో నుండెడిది. వానిచేత రామభజన చేయించుచు రామ! రామ! యనిపించుచు నాడించుచుండెడిది.

తీరకవేళలందు కూర్చుండ నేర్చిన తరువాత భజనలు చేయించుచు పొంగుచు కాలము జరుపుచుండెడిది. తన కుమారుని యెవరు ఏమిచేయుదురో యని వేయికళ్ళతో చూచుచుండెడిది. బాలుడై దేండ్లవాడైన తరువాత తండ్రి తులసికక్షరభ్యాసము గావించెను. ఓనమాలు దిద్దించి శుభముహూర్తమునందు పాఠశాలకు పంపించెను. ఆరోజులలో బడిపంతుళ్ళందరు విద్యావంతులే! వారు శ్రద్ధగా శిష్యులను తీర్చిదిద్దగల సామర్థ్యము గలవారు. తమవద్ద విద్య నేర్చినవారందరూ గొప్పవారైయుండి కీర్తి సంపాదించుకోవలయునను కోరిక తోడనేవారు సొమ్ము ప్రధానము గాకుండా విద్యాదానము ప్రధానముగా గణించుకొనుచు విద్య నేర్పుచుండువారు.

అట్టి గురువువద్ద తులసీ చదువునకు ప్రారంభించెను. పూవు పుట్ట గనే సువాసన గన్పించుచున్నట్లు పిల్లవాడు గురువు దిద్దించిన యక్షరములు చక్కగాదిద్ది వాటినప్పగించెడివాడు. అతడు క్రమముగా పుస్తకము పట్టెను. వానిచే బాలరామాయణము. శబ్దమంజరి యితర ప్రార్థనా శ్లోకములు చదివించ సాగెను.

# తులసీదాసు విద్యాభ్యాసము

తులసి బుద్ధిబలముతో వాటినవ్వగించు వాడాయెను. ఆ చురుకు తనము, బుద్ధిబలమును గురువు మెచ్చుకొని తనవద్ద కూర్చుండబెట్టుకొని శ్రద్ధగా పాఠములు చదివించుచు బోధించుచుండెను. వాటిలోని యర్థములు గొప్పగా వివరించసాగెను. బాలుడుపనయన వయస్సువాడైన తరువాత తండ్రి తన కుమారున కుపనయనము గావించెను. ఉపనయనానంతరము బాలునిచే త్రికాల సంధ్యావందనము గావింపజేయుచు విఘ్నేశ్వరపూజ, పుణ్యాహవచనముచెప్పసాగెను. తదుపరిపూజామంత్రములు, అభిషేకమంత్రములు, హారతి, మంత్రపుష్పములు వరుసగా తండ్రి నేర్పసాగెను. బడిలో తులసీదాసునకు గురువు శబ్దమంజరితోపాటు మహాకవి కాళిదాసు రఘువంశముతో పాఠములు ప్రారంభించెను. పూర్వపుణ్యఫలముచే కాళిదాసుగారి రచనలలోని రహస్యములు, కవితామాధుర్యము తాను రుచి చూచుచు గురువువద్ద తనకు తట్టనివి వివరములు గ్రహించసాగెను.

కవితా ప్రయోజనములు, రచనలలోని మాధుర్యము క్రమముగా విమర్శించి బుద్ధిబలము పెరుగగా శ్లోకములందలి భావములు తెలియ చదువుచుండెను గురువువద్ద ముందు శ్లోకముచదివి, పదములు విడదీయును. తరువాత సమన్వయముగా పదములమరించును. భావము, దానికర్థము చెప్పించుకొనును. శబ్దములు విడదీసి యేవి యే లింగమో, యే శబ్దమో యందులో నేవి విభక్తియో చెప్పును. సమాసములు చెప్పును. మొత్తమంతయు నన్వయించును. తనకు తెలిసినట్లు చందస్సులో నే వృత్తమో, యే గణముతో

నా వృత్తమగునో దాని లక్షణముచెప్పి మరల పూర్తిగా శ్లోకమును చదువును. ఇట్లు చక్కగా విద్యను నేర్చుకొనసాగెను.

తన బుద్ధిబలముతో గురువు చెప్పిన శ్లోకములు పఠించుచు ముందురోజు పాఠములు గూడ చదివి సిద్ధపడుచుండును. తోడివిద్యార్థులు వాని చదువునకబ్బురమందుచుండిరి. గురువు తులసిని చూచి మితిమీరి పొంగుచు వారందరికన్న పెద్దగ్రంథముల విషయములు చెప్పుకొని పోవు చుండ జాగ్రత్తగా వాటినాకళించుచుండెను.

ఇట్లు మహాకవుల గ్రంథములు, పంచకావ్యములు నైషధము అలంకార శాస్త్రము తనంతట తాను తనతండ్రి వద్దనున్నవి తీరికసమయ ములో చదువుకొనుచుండువాడు. అందలి విశేషములు తనకు తెలిసినవి గ్రహించుచు తెలియనివి గుర్తుపెట్టుకొని సందేహములు తీర్చుకొనుచు యందలి విశేషములు గమనించుచుండెను ఇట్లు సంస్కృతములోని గ్రంథ ములు చదువుచు సంస్కృతభాష యందున్న గొప్పతనము రుచి తలచుకొని పరమానంద మందుచుండును ఇట్లు మహానుభావుడైన తులసీదాసు ధారాళ ముగా దేశ భాషలు మాట్లాడుచు చదువుచుండెను. తండ్రి వద్ద మంత్రములు నేర్చుకొను చుండెను. అతడు నిత్యము స్నానము చేసి సంధ్యాదులు తీర్చు కొని గాయత్రమహామంత్రమును జపించును పిమ్మట యిష్టదేవతా స్తవములగు శ్లోకములు చదువుకొనును గురువుగారి వద్దకు మహాగ్రంథముగొని మధ్యా హ్నము విశ్రాంతి పొందిన యనంతరము పాఠం చదువును.

ఇట్లు కొన్నాళ్ళు జరిగిన తరువాత తులసీదాసునకు రామకథ యన్న రాముడన్న భక్తి ప్రబలసాగెను. రామాయణము వాల్మీకి రచించెను.

ఆయన రామకధలో యెంత గొప్పభక్తి చూపించెనో యదియంతయుచదువు కొని రుచి చూడదలచెను. మరునాటినుండి రామాయణము కొద్దిగా మంచి పట్టులున్న భాగములు తనకు నచ్చినవి తీసి చదువుకొనుచుండెను. పూజ్య మగు రామాయణము పారాయణ గ్రంధముగా నెరిగిదానిని శుచిగానొక్కొక్క శ్లోకమే స్తోత్రాదులైన తరువాత చదువుచు వాల్మీకి మహామునికి జోహరు లిచ్చుచుండును. క్రమముగా షోడశవర్షప్రాయుడైన తరువాత రామాయణము రచనను గ్రహించమొదలిడెను. రామాయణము ఇరువది నాల్గువేలశ్లోకములు.

గాయత్రీ మంత్రము యిరువది నాల్గక్షరములుగలది. ఆ మహా మంత్రములోని బీజములుయిరువది నాల్గుశ్లోకములతో గాయత్రీరామాయణము వ్రాసెను ఆ రామకధను ముందుక్లుప్తముగా బాలారామాయణము రచించెను. ఆ పిదప గాయత్రీ రామాయణములో యొక్కొక్క బీజాక్షరముతో మొదలుపెట్టి వేయి శ్లోకములు వ్రాసెను.

అటు యిరువది నాల్గు బీజాక్షరములకు యిరువది నాల్గువేల శ్లోకములతో రామాయణము మహాగంధ్రముగా వాల్మీకి రచించినాడు. దాని విషయము నేనాలోచించెదనని మంత్రాక్షరముల మహిమ, గొప్పగంధ్రము లోని యర్ధము, యందులో కధలు సవివరముగా ప్రతిదినము కొంచెము కొంచెముగా చదువుచు పొంగిపోవుచుండెను. అందలి రాముడు, నాయకుడు, సీతనాయికురాలు, సోదరులు, సుగ్రీవుడు మొదలగు స్నేహితులు, ఆంజనేయులవంటి దూతలు యిటు వంటి వన్నియు ప్రత్యేకముగా చర్యసాగించు చుండెను. ఇంటివద్ద తన కుటుంబమువారు మహాభకులు, వేదవిద్యలునేర్పిన

వారు. ఆచారములు నడుపువారు యితరులు సొమ్ముల కాసపడని వారుగా మసలుచుండుటచే మనతులసీదాసుకూడా మంచి కట్టుబాటునకు లొంగిన జీవితమును సాగించుచుండెను. అట్లాతడు విద్యాబుద్ధులుగల్గి తిరుగుచు మంచి పండితుడను పేరుదెను.

అతని విషయము క్రమముగా పల్లెలోనేగాక చుట్టు ప్రక్కల యూళ్ళలోగుండ నాతనిపేరు ప్రాకినది. తులసి యెంత గొప్పవాడైనాడు. నిన్నమొన్నటిదాకా యేదో సామాన్యముగా తిరుగువాడు. ఎవరితోడను మాట్లాడువాడుకాడు. ఇంత గొప్ప తెలివి యెట్లబ్బినదోచిత్రముగదా! యనుకొనుచు యూరిలోనివారు సమయమునను సరించి "యేదీ బాబూ? కొంచెము సేపు గ్రంధములను నీ నచ్చినవి విన్పింపవా? విందుమ" ని కోరు చుండెడివారు. ఆ మహా భక్తుడు వారికి సంతోషముకల్గజేయదలచి రామాయణంలోని భాగములు తనకుతోచినది విన్పిజేయుచుండువాడు ఇట్లుతీరిక వేళల యూరివారకి రామకధ విన్పించసాగెను. సాయంసమయమునకు ప్రతి దినమాతని యింటికి జనము ప్రోగుపడసాగిరి.

"మనతులసిరామకధ చదువుచున్నాడురండని" యొకరి కొకరు చెప్పుకొనుచు జనులు జేరి మంచి కాలక్షేపము జరుగుచున్నదని సంతోషించు చుండిరి. ఈ విషయము సమీపగ్రామముల వారు విని వారుకూడ ప్రతి దినమాసమయమువకు గుంపులుగా రాసాగిరి. ఇట్లుప్రజలవలనమంచి పేరంది తులసీగొప్పవాడనియు, బుద్ధిమంతుడు, విధ్యావంతుడనియు చెప్పుకొనసాగిరి.

# తులసీదాసు వివాహము

ఆ ప్రాంతమంతయు మన కథానాయకుని కీర్తి ప్రాకినది ఆతనికి వివాహ పయస్సువచ్చినది. తమపుత్రుడొక యింటివాడైన చూచి సంతోషించ దలచిరి. తులసి తల్లితండ్రులు పిల్లవాడు పెద్దవాడైన కొలది తల్లి దండ్రులు ముసలితనముతో నుండువారగుదురు గదా! అందుచేత తమ వంశము నిల్పుకీర్తిని గడించిన కుమారునకు సంతానము గల్గిన సంతోషింతుమని యెప్పుడు వివాహము చేయుదుమా? యని యెదురు తెన్నులు చూడ సాగిరి. పూర్వము రోజులలో సంబంధ బాంధవ్యములు చుట్టుప్రక్క గ్రామములలో తమకు సమీపముగా నుండునట్లు, రాకపోకలకు వీలగునట్లు చూచుకొనుచుండిరి. పూర్వము వారికి పెండ్లియగుట చాలు. మంచి కుటుంబములోని కన్యక తమ యింటికివచ్చి యింటిపేరు నిలుపునది గావలయుననియు, పెద్దలకు సేవచేయుచు, యింటికి వచ్చిన చుట్టములకు, యితరులకు ప్రేమగా యింత భోజనాదులు పెట్టుగుణము గలదియునై యుండిన చాలుననుకొనువారు.

కట్నములు కానుకలు కోరేవారుగాదు. కుటుంబమర్యాదలు పాటించువారు. ఇంక పిల్లనిచ్చువారు "తమ పిల్లకు కడుపునిండా తిండిపెట్ట గలవారు, పదిమంది బలగము గలవారు, యేకధాటిగా నియమములు పాటించి శ్రోత్రియులై యుండువారు, వేదాది విద్యలు నేర్చినవారుగా నున్నచాలు. సిరి, సంపదలు యెట్లున్నను పట్టించుకొనక వారింటిలో మనపిల్లను పడ వేయవలయునని యోచించువారుగా నుండిరి. అందుచే రాకపోకలకు వీలుగా

మంచికుటుంబమువారు వచ్చి తమ పిల్లనిత్తుమన్న చేసికొందుమని తలసి తల్లితండ్రులాలోచించుచుండిరి.

ఆ రోజులలో "పిల్లనిత్తుమన్న చాలును" యెగిరి గంతువేసి సమ్మతించుటాచారము. ఇంటికివచ్చి కన్యక నిత్తుమన్నవారిని కాదన్న కీడని భయముతోను. మర్యాద భంగమను వెనుకాటతో వంకలు పెట్టకుండా సమ్మతించువారు. అందుచే నుభయపక్షములవారికి వివాహములన్న సులభముగా శక్తిననుసరించి చేయుచుండువారు.

పూర్వపద్ధతిలోనే మన కథానాయకుని కుటుంబమువారుండుటచే వివాహము శాస్త్రీయముగా నైదురోజులగ్నిహోత్రములతో చేయవలయును. ఆ విధముగా చేయించగలవారి కుమార్తెను తన కుమారునకు చేయనిశ్చయించిరి. ఇట్లు యోచించు సమయములో సమీపగ్రామములో నొక పూర్వాచారములు పాటించు కుటుంబము వేదవిదులగు వారితో నిండినదియు. సంప్రదాయమునకు లోటు రానిదియు గౌరవ ప్రపత్తులతో సాగుచుండిన వారుత్తమ గుణసంపన్నులు గలవారునగు వారింట నొకకన్యకు వివాహ వయస్సు వచ్చినది యున్నది. పూర్వము వివాహములు యెనిమిదేండ్లు వయస్సు రాగానే వివాహములు చేయుచుండు పెద్దల పద్ధతితో వారుకూడా తమ కుమార్తెకు యెనిమిదేండ్లు రాగానే పెండ్లి చేయదలచిరి. అందులకై వారు వరులకై వెదకసాగిరి.చాలాచోట్లు పూర్వమువారు తిరిగి తిరిగి తమకు నచ్చిన తరువాత గాని పెండ్లికుమారుని యింటిలోని కడుగిడేవారుకారు.

ఇట్లు తిరుగుచు పొరుగూరు సంబంధము సమీపములోనున్నదియు బుద్ధిమంతుడగు వరుడు గలదియు.విద్యావంతుల కుటుంబమైనదియు, నలుగురు గలదియునగు తులసీదాసు కుటుంబమువైపు వారు దృష్టిమరలించిరి. ఒకనాడు

శుభ సమయము వార వర్జ్యములు పరిశీలించి కన్యాదాత తనవారితో తులసీ దాసు యింటికి వచ్చిరి. ఇట్లు వచ్చినవారిని చూచి వారిపని తమకు తెలియక పోయినను కాళ్ళు కడుగుకొనుటకు నీళ్ళు యిచ్చిరి. దాహముకావలయునా? యని యడిగి దాహమిచ్చి యొకచోట నింటిలో నరుగుమీదచాపపైకూర్చుండ జేసి సంతోషముగా ప్రక్కగా యజమాని నిలచెను. అయనను వారు కూర్చుండజేసిరి.

పిమ్మట వచ్చినవారిలో మంచిమాటకారి కన్యాదాతకు కావల సిన వాడు చిరునవ్వుతో నిట్లుమొదలుపెట్టెను. అయ్యా! మేము మీ యింటికి యింతరము వచ్చిన విషయము చెప్పుచున్నాను వినండి. ఈయన మా బావ గారు. వారివద్ద నొకకన్యక వివాహమునకు తగిన యీడులోనున్నది. మీ విషయము నేనుకూడా బావగారితో చెప్పినాను.

మీవద్ద బుద్ధిమంతుడగు వరుడున్నాడనియు, మనకు వారికి సంబం ధము కుదురుననియు, సంప్రదాయము గలవారనియు చెప్పినాను. మీ కుఱ్ఱ వాడు తులసి పేరు యిదివరకే చుట్టుప్రక్కల గ్రామములలో ప్రాకినది. అందుచే మీ కుటుంబము మర్యాదకు వరుని గుణములకు విద్యాబుద్ధులకు మేము సంతోషించి మా మేనకోడలను మీ యింటికోడలుగా చేయదలచి వచ్చినాము. మీరు దయయుంచి మా మనవిని సంతోషపూర్వకముగా నంగీకరించ గోరుచున్నామని మొదలిడెను. తులసీదాసు తల్లి తలుపుచాటు నుండి యిదియంతయు పరమానందముగా వినుచుండెను. తనకు మంచి కుటుం బములోని పిల్ల కోడలుగావచ్చి యిల్లు తీర్చిదిద్దుతుందని యురకలు వేయు చుండెను. మన కథానాయకుని తండ్రి యంతయువిని లోన సంతోషించి

వచ్చి వారి విషయము పూర్వము తనువిని యుండుటచే మనస్సులో సందేహ మందక యుత్సాహముతో నిట్లనెను.

అయ్యా! మీరు నాయింటికి శుభమునకు వచ్చినప్పుడు నేను కాదందునా? ఇదివరకుకూడా మా పెద్దలు నిట్లనుకొనువారు. కన్యాదానము సాల గ్రామదానము, సరస్వతీదానము యుభయులకు నుత్తమలోకములు గల్గించునదిగా నున్నవి. అందుచే నింటికి పిల్లనిత్తుమని వచ్చినవారిని కాదన గూడదు. నే నాటంకము పెట్టను తప్పకుండా సమ్మతింతును. ఈరోజు మన కందరకు శుభదినముగా భావించెదను. ఇలట్లో యీ విషయము చెవినివేయు దునని లోనికిపోయి భార్యకు యీ విషయము వివరించెను. ఆమెకూడా సమ్మ తించెను. వరునితో మాట్లాడవలసినపని యాకాలములోలేదు. పెద్దలు సమ్మ తియే ప్రధానము. వరుడంగీకరించును. వారికెదురు చెప్పడు.

తులసీదాసు విన్నాడు తటస్థముగా నున్నాడు పెద్దలయందు మర్యాద పాటించినాడుగదా! ఇప్పుడు యజమాని మాకు సర్వసమ్మతము మీరు మంచిరోజు నిశ్చయించి మమ్ము రమ్మన్న పిల్లను చూతుము. నిశ్చయ తాంబూలము పుచ్చుకొని వివాహముహూర్తము నిశ్చయించుకొందమని చెప్పి వారిని సగౌరవముగా సాగనంపెను.

కొలది దినములకు కన్యాదాత యింటివద్దనుండి శుభవర్తమాన మందెను. వారు నిశ్చయించిన శుభసమయముగల రోజున తులసీదాసు తండ్రి తన ముఖ్య బంధువులకు కబురుచేసి వారితో తానుబయలుదేరి యా గ్రామము చేరిరి. కన్యాదాతవారి బంధువులు వీరిరాకకై యెదురుచూచు చుండిరి. వారి రాకకు పరమానందమంది యెదురుగాబోయి గొనివచ్చి పాదప్రక్షాళమునకు నీరిచ్చి యొకచోట గౌరవప్రదముగా కూర్చుండజేసిరి. తరువాత దాహతీర్థ

ములు తీర్చుకొనిరి. కన్యకను యలంకరించి వారిముందు కూర్చుండబెట్టిరి. వారాకన్యకను శుభలక్షణములుగల చిన్నదానిని చూచివారితో వారలుయిట్లను కొనిరి. పిల్ల చక్కగానున్నది. ఈడుజోడు బాగున్నది. అమ్మాయికూడా చదువుకొనుచున్నది. ఇంటిపనులు చక్కగాచేయుచున్నది. బుద్ధిమంతురాలు మనము సంశయమువదలి "తథాస్తు"యందా మకొన్నారు.

వెంటనే యాడు పెండ్లివారితో తమ సమ్మతిని వెల్లడించిరి. వారు పరమానందమందారు. వెంటనే నిశ్చయతాంబూలములు పుచ్చుకొన్నారు. మగపెళ్ళివారి సంబంధీకులతో సహాకన్యాదాత యింటివద్ద చక్కగా నారగించి నారు. కొంచెము సేపు విశ్రాంతి గొన్న తరువాత పెద్దలగు వారిని పిలిపించి. యొక శుభముహూర్తము నిశ్చపరచిరి. వారుభయులా ముహూర్తమునకు సమ్మతించగా లగ్నపత్రిక లందు కొనిరి ఇరువైపులవారు పెండ్లి ప్రయత్నము లలో నుండిరి. శుభముహూర్తమునకు సర్వసన్నాహములు సలుపు కొనుచు బంధువులతో యిల్లు నిండుగా పరమానందముగా శోభించసాగెను. పెండ్లి కుమారునిగా తులసీదాసును చేసిరి. క్రొత్త బట్టలుకట్టి పల్లకినెక్కించిరి. అందరూ బండ్లమీద ప్రయాణమై పెండ్లికి వెళ్ళిరి.

సుముహూర్తమునకు మంగళస్నానములు చేయించి పీటలమీద కూర్చుండ బెట్టిరి. పురోహితులు వివాహమంత్రములు చదవగా పేరంటాండ్రు చూచి దంపతులను దీవించగా పసుపుబట్టలతో వారు వివాహమైన తరువాత పెద్దలకు నమస్కారములు గావించి దీవనలందిరి. ఐదురోజులు యగ్నిహోత్రములతో వివాహము తంతు నడిచినది.

తరువాత మగపెళ్ళివారు పెండ్లికూతురినితో. ఆమె వైపుచుట్టాలను వెంటబెట్టుకొని మనుగుడుపులు సాగించిరి. ఆడ పెండ్లివారు మనుగుడు

పులనంతరము పెండ్లికూతును. వరుని. వరునికీ కావలిసిన ముఖ్య బంధువును మనుగుకుపులకు గొనిపోయిరి, ఇట్లు చక్కగా తులసీదాసు వివాహము జరిగినది. భార్య యీడేరు వరకు పండగలకు నత్తవారింటికి వెళ్ళుచూ, తన గ్రామములో నున్న భూమిని వ్యవసాయము చేసికొనుచు తన వారితో సంతోషముగా కాలము జరుపుకొనుచుండెను. రామాయణ పారాయణము వేద విహిత సదాచారము నడుపుచు విద్యావ్యాసంగము వ్యవసాయముతో కాలము సంతోషముగా జరువుకొనుచుండెను. కొన్నాళ్ళకు తులసీదాసు భార్య యీడేరినది. పెద్దలు శుభముహూర్తము చూచి దంపతులను కలిపిరి. ఇట్లు వారు దాంపత్య సుఖమనుభవించుచు కాలము జరుపుచుండిరి.

భార్య విద్యావంతురాలైనది, పుట్టినింటివారు చదువును చక్కగా నేర్పిరి. మంచి విజ్ఞానముతో, పతియందనురాగముతో, యింటిపనులు చక్కబెట్టుకొను నేర్పుతో, పెద్దల యందు గౌరవము సేవాభావముతో సంచరించుచుండుటతో నాతడు పరమానందమందెను విడదీయరాని ప్రేమ బంధముతో వారు మసలు చుండిరి. ఇట్లుకొన్నాళ్ళు సాగినది. ఒక పండుగ సమయము వచ్చినది. తులసీదాసు భార్యను పుట్టినింటివారు పండుగ సమయమునకు ముందుగావచ్చి గొనిపోవుచు నాతనిని పండుగ రోజులకు రమ్మనియాహ్వానించిరి. ఆతడు సమ్మతించెను. ఇక్కడ వ్యవసాయపు తొందరలు హెచ్చనుండెను. తగినట్లు వ్యవసాయపు వనులు చేయకున్న పంటకాలము గదా! పాడగును,

అందుచే భార్యతో వెళ్ళలేదు. వ్యవసాయము చూచు కొనుచు పంటను రాశి చేయువరకు ప్రొద్దుపోయినను యచటనిలిచి కుప్పలనూర్పించు

చుండెను. పండగ రోజునకు యెట్లన ముందుగా నత్తవారింటికి వెళ్ళవలయు నని యనుకొన్నాడు కానిసాగలేదు బుద్ధి భార్యపై మళ్ళినది.

## తులసీదాసు రాత్రి ప్రయాణము

తాను భార్యను కలుసుకో దలచెను రాత్రి ప్రొద్దుపోవు వరకు పని కాలేదు గదా! తరువాత నింటికిపోయి భుజించినాడు. మరల పొలములో పని యున్నదని యింట్లో చెప్పినవాడై పొలమునకు పోయి పని పురమాయించి యత్తవారింటికి ప్రయాణమయ్యెను. రాత్రి చీకటివేళ నొంటరివాడు యితర మాలోచించకుండా కాలిదారిని నడచిపోవుచుండెను. అట్లు కొలదిమైళ్ళ దూరములోనున్న తన యత్తవారింటికి నడిరేయి కన్నుపొడుచుకొన్న కాన రానిదారిలో పడిపోవుచుండెను ఇట్లాతడు పోయిపోయి యత్తవారియూరు జేరుసరికి నడిరేయైనది. ఆ రోజులలో వీధులలోగాని గ్రామములయందుగాని సందెదీపముల వెలిగించి సాయంత్రమే పడుకొందురు. చిమ్మచీకటినిర్మానుష్య మైన గ్రామములో ప్రవేశించెను. అందరు తలుపులు బిగించి నిద్రలో నుండెను.

తులసీదాసు తన యత్తవారింటికిపోయి వీధితలుపులు తట్టెను. తరువాత కేకలువేసెను ఎవరు సమాధానము చెప్పలేదు. పలుకలేదు. ఏమిచేయుదు నాయని యోచించసాగెను. వీధిలో యెంతసేపు నిలబడగలడు? చివరకు నటునిటు పరికించి చూచెను. ఆ ఇంటికిచుట్టు ప్రహరీగోడగలదు. గోడనంటి రకరకములగు వృక్షములున్నవి. అవియన్నియు గుబురుగానుండుటచే తన కానమాలుగ నుండుటకు గోటమీద నల్లగా త్రాడువలె వ్రేలాడుచుండెను.

తనకు యింటిలోనికి పోవుటకు మార్గాంతరములేదు. ఇంకతాను యా వ్రేలాడు చుండు త్రాడువంటిదాని సాయముపొందనెంచెను.

వెంటనే యా త్రాడునుబోలిన దానిని పట్టుకుని ప్రహరీగోడ కెగ ప్రాకసాగెను. అతడు బలవంతముగాదాని యూతగా గోడనుదాటు లోపల పట పట యా పదార్ధము తెగిపోయినది. చివరకాతడు దూకిపోయెను. ఇంటిలోని గది గుమ్మముముందు నిలబడి తన భార్యను పిలిచెను.

నిద్రలోనుండి భార్య కొంత సేపటికిగాని పలుకలేదు. తరువాత భర్త కంఠము గ్రహించి తొందరగా తలుపులు తీసెను. తీసినతరువాత తొంద రగా చూచినది. శరీరశ్రమతో చమటబట్టిన యొడలితోనున్న భర్తనుచూచి తెల్లబోయి యిట్లన్నది. మీరు యింతగా నాయాసపడి యెట్లువచ్చినారు? మా తలుపులన్నియు మూసివేయబడినవిగదా! ఎవరువీధి గుమ్మముతలుపు తెరచి నారు? ఇంతయర్ధరాత్రివేళ వరకు ఎందులకాగినారు? త్వరితముగా యింత రాత్రి వరకుండకుండా రాలేకపోయినారా? ఇటువంటి కటిక చీకటి. నరసంచా రములేని సమయము యేవిషజంతువైనా దారికడ్డుపడిన యెంతప్రమాదము. మీరింత సాహసము యెందులకు చేసినారు? ఎంతప్రమాదము తప్పిపోయినది నా పసుపుత్రాడు గట్టిదిగాన బయలుపడ్డారు. చాలుచాలునని మని వీధితలుపు యెవరుతెరచినారు? మీరేగున యింటిలోని కడుగిడినారని నిలదీసి యడిగినది.

ఆమె మాటలకాతడు తెల్లబోయినాడు. తనభార్యనుచూచి "నేను ప్రహరీగోడను నీవు వేసినత్రాడు పట్టుకొని దూకివచ్చినాను. నాభార్యయం దలి ప్రేమ నన్నుయింతగా సాహసముచేయ జేసినదన్నాడు. ఆ మాటలు విని నేనేమిటి? త్రాడువేయుటయేమిటి? ఇదివింత నేనసలు త్రాడువేయలేదు. అదియేదియో చూచెదను" యనిలోనికిపోయి పడవలాంతరును చేతబట్టుకొని

దీపముతో తన భర్తను చూచెను. అతని బట్టలన్నియు రక్తమయములైనవి. ఇదిచూచి చాలగాబరా పడిపోయి "యీరక్తమెక్కడిది.? ఏ దెబ్బతగిలినది? మీరు చెప్పుటలేదు." యని శరీరమంతయు తడిమిచూచెను. శరీరముమీద యేమీ దెబ్బలు అనుపించలేదు. మీరు దేనిసాయముతో గోడదాటినారన్నది.

అదివిని యిదివరలో చెప్పిన సమాధానము చెప్పభర్తతో నా యిల్లాలు ప్రహరీగోడ దగ్గఱకు చేతిలాంతరుతో వెలుగు చూచుచు ముందుకు సాగినది. గోడవార రెండు మొండములుగల నల్ల త్రాచుపాము శరీరము కన్పించినది ఒక ముక్కగా గోడనంటియున్నది. అదితలభాగము ఇది అంతయు తులసీదాసు భార్యచూచినది.

## తులసీదాసును భార్య మందలించుట

తన భర్తవైపు తిరిగినది. ఈ రక్తము మహాసర్పమునకు సంబంధించినది.గా తెలియుచున్నది. ఈ రాత్రివేళ ప్రహరీ గోడమీదనున్న నల్ల త్రాచుపామును త్రాడుగాభావించినారా? నేనుమీకైవేసినానని యూహించినారా? ఎంతప్రమాదము దాటినది ఈపాటికి నేను వైధవ్యము భారము వహించు యోగము పరమేశ్వరుడు తప్పించినాడు ఇది నాభాగ్యము ఆ రాత్రివేళ త్రాచు పామో! త్రాడో! యేదియోగూడ తెలియలేదా? అబ్బా! ఎంతటి యజ్ఞానము పొందినారు? మీరు విజ్ఞానులనియు. విద్యావంతులని యనుకొన్నాను. కాని యింతటి కామాంధకారములో నున్నారనుకోలేదు. ఎంతదారుణము? ఎంత సాహసము! చాలగొప్పపని చేసినారు నాకు శరీరములో వణకుపుట్టుచున్నది. ఈ మహా కృష్ణసర్పము ఎంత సౌమ్యమయినది.మీకు తన శరీరము నర్పించి నన్నుద్ధరించినది.

ఇదిచాలు మావాండ్రు విన్నచో కన్నచో నన్నెంతగానిందింతురు? ఎంతచులకనగా చూతురు? నీపెనిమిటి చదువంతయు నిమిషములో తేలిపోయి నదనరా? నేనులోకువగానా? యింక మనము కిక్కురుమనకుండా లోనికి పోవుదము ఈ బట్టలు వదలివేయుడు దొడ్డిలోనున్న భాండములో మంచి రక్తపుమరకలు పోగొట్టెదను వాటినిగోడకార వేయుదును. మరునాడు వారడిగినచో చీకటిలో బురదలో పడినారు బట్టలు తడిపినానని మావాళ్ళతో చెప్పెదను యనిలోనికి చెయ్యిపుచ్చుకొని గొనిపోయి బట్టలు విప్పించితనవద్దనున్న భర్త వస్త్రములు తనతోగొని వచ్చినవి కట్టబెట్టినది. అతడు వదలిన బట్టలు భాండములోని జలములో నుసిమి యారగట్టెను.

తరువాత తనభర్తను గదిలోనికిగొనిపోయి శయ్యపైకూర్చుండ బెట్టి మృధువుగా మధురముగా నాతని మనస్సునొవ్వకుండా యిట్లు ప్రేమతో మాట్లాడసాగెను. ఏమండీ! త్రాచుపామును త్రాడుగా భ్రమించినమీరు ఎట్లుండగలరు? సాహసము యెల్లవేళల పనికివచ్చునా? అర్ధరాత్రివేళ ప్రయాణము లెవరు చేయుదురు?

జారులు, చోరులు ఈ నిశా సమయములో తిరుగువారు గాని గృహస్థులు తిరుగుదురా? ఒక జాము ప్రొద్దుపోయిన తరువాత చీకటిలో ప్రయాణము ప్రమాదము గొనిరాదా? చాలు! చాలు. ఎప్పుడు యిటువంటి దారుణ ప్రయాణము చేయకుడు. నాయందు మీకు మమకార మున్నచో సాయంత్రమునకు రాలేకపోయినారా? ఇది యెంత ప్రాణ భయము? మృత్యువుతో కోరి కోరి చెలగాటము లాడుదురా? అబ్బా! మగవారైన మాత్రమునకు మరణ భీతి యుండదా? మరణము స్త్రీ పురుషులకు సమానమే! ఆడుది యబల యని భయస్థురాలని యనకొనకుడు. అందరికీ జీవితములమీద గల తీపి సమా

నముగదా? ఏమనుకొని యిట్లు వచ్చినారు? నావారు విన్న నా బ్రతుకు నవ్వులపాలు గాదా? ప్రమాదము వచ్చిన నా బ్రతుకు గంగపాలు గాదా? మీ సాహసము నా కొంప తీయలేదనెను.

అది విన్నాడు తులసీదాసు. తిరిగి యిట్లన్నాడు ఇల్లాలా! నేను యింత యర్థరాత్రియే భయములేకుండా యొకే నిదానముమీద యెట్లు రాగలిగినా ననుకొన్నావు. ఇది యంతయు నీవు నాకు భార్యగా నుండి నన్ను మనస్సు రంజిల్లునట్లు చూపిన యనురాగమే యింతకు కారణము నా భార్యను చూడకుండా యుండలేక పోయితిని రాత్రి కాదు పగలుకాదు నీతో నుండిన జీవితమునకు విలువలేదు. నేను నిన్ను విడచి యుండలేకపోయితిని. నిన్ను చూడగా బుద్ధి మెరుపువలె మెదలినది దానితో పొలములోని పనులు పూర్తిగావించుకొని యింత నిశలోగాని ప్రయాణించ వీలుపడలేదు. నీవు నన్ను మనసార ప్రేమతో చూచిన యనురాగ బంధము నా హృదయమునకు లంకె వేసినది.

ఆ లంకెలో పడిపోయినాను. దానిని తప్పింప తరముకాలేదు. ఏ వనిత తన భర్త హృదయములో నిర్మలమగు స్థాన మాక్రమించుకొని యుండునో యామె ధన్యురాలు, పూజ్యురాలుగా చెప్పదగును. నీకు నేనటువంటి పూజ్య స్థానము నా హృదయములో గల్పించి యుంచినాను. ఇది నా యాంతరంగిక విషయ మన్నాడు.

ఇట్లు భార్యాభర్తలు తమ తమ హృదయములలోని విషయములు వెల్లడించుకొనుచు మాట్లాడసాగిరి.

తరువాత తులసీదాసు భార్య భర్తనుచూచి యిట్లుపదేశము చేయ నారంభించినది. "ఏమండీ! మీరు నన్ను మీ హృదయమున స్థానమిచ్చి

గౌరవించుటచే నేను ధన్యురాలనయినాను. మీ మనస్సు నాయందు లగ్న మగుటచే మన దాంపత్య జీవితము గౌరవనీయమైనదని చెప్పగలను? అయినా నేను యింకొక యడుగు ముందునకు వేయుచున్నాను. భార్య యెవరు? భర్త యెవరు? దానిని గురించి మనము చర్చించుట మనధర్మము భార్య యొక శరీరధారి! భర్త యొక శరీరధారి! ఇద్దరు యెంతకాలము కలిసి యుందురు. జీర్ణించునది శరీరము. ఈ వయస్సు ఈ కామ సుఖము లెంత కాలము సాగును. శరీర బింకము గల్గినంతసేపు సాగును. వయస్సు జారుట కారంభించిన తరువాత మన యిద్దరి మమకారము శరీరకారణములతోను. యింద్రియ బలము తగ్గిన కారణముతోను సన్నగిలిపోవదా?

మన కండ్లముందు యెందరు ముసలితనముతో బాధపడుచున్నారు. ఎందరు రోగములతో తీసికొని బాధపడుచున్నారు? ఎందరు మరణము చెందుచున్నారు? ఎవరు యిచట శాశ్వితముగా నున్నవారు లేరుగదా! అనగా మన మోహము. మన సంసారములు శరీర బలము ననుసరించిగాని మరొక గతిగా నడుచుటలేదు. అటువంటి శరీరములు మనము ధరించినాము? ఈ శరీరములతో నున్న కాలము మాత్రమే మన యనుబంధములు. యనురాగ ములు ఇందులోనుండి యీ జీవులు దాటిన యెవరికి వారే యమునాతీరేగదా! ఎక్కడినుండియో వచ్చినాము ఎక్కడికో ఈ శరీరములు వదలి పోవుదుము.

ఇది శాశ్వితము గావు గద! మనకు శాశ్వితమేమి? ఈ శరీరములతో చేసిన సత్కర్మలయొక్క ఫలితమే ఈ శరీరము ధరించినందులకు ఫలి తముగదా! అందుచే మన మన్యోన్యముగా నుండి ఈ మోహ విషయము

శారీరకమయిన దానిని వదలివేయుట మంచిదిగాదా? ఎక్కువ మీకు నేను చెప్పదగినదాననా?

అయినను నేను నా హృదయము విప్పి మీతో చెప్పుచున్నాను. నేను భార్య శరీరముతో నున్న జీవిని. నేను యీ శరీరములో నున్నంతసేపు భార్యనే! ఈ శరీరమునుండి నేను యనబడు జీవిదాటి పోయినప్పుడు యీ శరీర మెవరు? యది కదలునా? మెదలునా? అట్టి కదలికలేని శరీరము నాశించి ప్రాణములపై యాశవదలి ఇంతపని చేయుదురా? యీ శరీరము రక్త మాంసములతో నిండినది. మల, మూత్రాది దుర్గంధములకు మూల మయినదని మీ రెరుగరా? అట్టి పరమ నీచమగు యీ శరీరమును మీరు కామ సుఖముల కపేక్షింపక యిహ పర సుఖములందుటకు మన మిద్దరు కలసి కృషిచేసి సత్యమగు తేజమును చూచు మార్గము వెదకుకొనుట మంచిది కాదా? ప్రపంచములో శాశ్వితములుగాని యీ శరీర సుఖములు మిత మగు కాలము మాత్రమే యనుభవించి విడిపోదుము. ఇట్లు యనుకూలమగు పరిస్థితులలో మనమిద్దరము యున్నత భావములతో యుత్తమ గతులందుటకు యత్నించుట మంచిదికాదా?

ఎంతకాల మున్నను యీ సంసారమునకు తుదిలేదు. సుఖములేదు. స్థిరముగాదు. అందులకై మీరు నాయందున్న మమకారము యటుంచి యట్టి మమకారము మనలను సృజించి భగవానుడగు రామచంద్రునిపై యుంచి నచో సమస్తము సుఖవంతమై యిహలోకములో కీర్తివంతమై పరమందు శాశ్విత స్థానమై తరింపుజేయగలదు రామనామము. మహా మహిమగలదిగదా! దానిని స్మరించిన పాపములు పటాపంచలగునుగదా! రాము కటాక్షమందిన

వారు యెందరు మహామహూలై దివ్యస్థానములు ప్రవేశించినారు. వారివలె మన దంపతుల కీర్తి స్థిరము కావలయును.

తులసీదాసు మహానుభావుడు. రామ భక్తాగ్రేసరుడను కీర్తి మీరు సంపాదించుకొనుడు. మీ భార్యనయిన నాకు మీతో నుత్తమలోక వాసము గల్పించుడు నా యందుండు వెర్రి భ్రమలు తొలగించుకొనుడు. నేటి మన మిరువురము స్నేహితులమై యుండదగును."

# తులసీదాసు విరాగము-గంగాతీర వాసము

మీరు మరియొక విధముగా భావించవలదు. ఇంతవరకు సంసార సుఖము లనుభవించినాము. యీనాటి యీ సందర్భముతో మనము చీకటుల నుండి వెలుగుత్రోవలోనికి పోయి ప్రయాణింతుముగాక! మన ప్రయాణములో శ్రీరామచంద్ర దర్శనము గల్గుటయు. స్వామి ప్రసాదముతో దివ్యలోక నివాసమునకు యోగ్యమగు సత్కర్మ లీ జీవితములుండు కాలముచేసి పరమ పదమందుదుముగాక! యెందుల కింక మీకు సంశయము? నేను మిమ్ములను వదలియుండను. మీతో నుండెదను. మన మిద్దర మా జీవాంతము స్నేహితులమే! వట్టి స్నేహితులముకాదు ప్రాణమునకు ప్రాణమెత్తయిన జీవితములు సాగించవలయును. శ్రీరామప్రభుని దయ సంపాదించవలయును. ఇది మన జన్మ సాఫల్యమునకు పెద్దత్రోవగా నెరుగుడు లెండు. తెల్లవారిని తరువాత మీరు చేయవలసిన పనిని యిప్పుడే నిర్ణయించెదను వినుడు.

మీరు యింటి మొగము పట్టుట మానుడు. యీ శరీరమునకు తగిన సత్కర్మ కలాపములో మునిగితేలుడు. మీరు గంగా తీరమునకు పొండు. అచట నొక పర్ణశాల నిర్మించుకొనుడు. గంగా స్నానముగావించుచు శ్రీరా

ముని జపించుచు కూర్చుండుడు. రామ దర్శన మగుదాక మీరు యింటి మొగము పట్టనని శపథము చేయుడు. మీరు దీక్షపూనినచో కార్యసాధనము చేయగలరు. రాముడు తప్పక దర్శనమీయగలడు. మనవాంఛ తీరును. అంత వరకు నా మాటగాని మన యిల్లు, సంసారముగాని తలపునకు రానీయకుడు. నేనుకూడ మీరు వచ్చువరకు రామునకై భరతుడు దీక్షపూనినట్లు దీక్షపూని కార్యము నడుపుదును.

ఇల్లు దిద్దుకొనుచు బ్రహ్మచర్య దీక్షలో నుండి శ్రీరాముని స్మరించు చునే నుందును. ఇంటి ప్రశంస మీ కక్కరలేదు. ఇప్పుడే నాయందు ప్రమాణముచేసి దీక్ష బూనుడు. నన్ను మీరానంద పరచదలచినారు. పూజ్య స్థానము కల్పించి మీ హృదయము నుంచుకొన్నారు గాన దానిని స్థిరపరచి యీ రూపములో నుంచుకొనుడని యుపదేశించెను.

ఆ యుపదేశమును తులసీదాసు వినెను. పరమానందమందెను. ఇల్లాలి మాటకు తిరుగులేదని నిశ్చయించుకొనెను. భార్యతో సమాధానముగా నిట్లు చెప్పెను.

ఇల్లాలా! మన జన్మలు తరించగల యుపదేశము చేసిన నీ మాటలు విశ్వసించెదను. నేను చదువుకొన్న చదువునకు ప్రయోజనము సాధించె దను. నిన్ను నాలో గురువుగా భావించెదను. స్నేహధర్మము పాటించ మన్నావు గాన పూజ్య ధర్మముగా నిన్ను హృదయమున నిల్పి శ్రీరామ కటాక్షమునకు ప్రయత్నము గావించెను. రామదర్శనము కాకుండా నేను నీ యానతి ప్రకారము యిల్లుకాని. సంసారముకాని. భార్య విషయమనికాని చింతించను. నేను రేపే బయలుదేరి పావన గంగా తీరమున నాశ్రమము

నిర్మించుకొని యందు శ్రీరాముని యందుంచిన మనస్సుతో యితరము పాటించకుండా తదేక ధ్యానముతోనుండి నీ ప్రమాణముగా దీక్షబూని శ్రీరాముని దర్శింతును.

నేను మాట తిరుగనని ప్రమాణము చేసినాడు. యా రాత్రి వారట్లు నియమము నిద్దరు పాటించి పరమాహ్లాదముగా కాలము జరిపిరి. తెల్లవారిన తరువాత యింటినుండి తిన్నగా తులసీదాసు భార్య సంతోషముతో నెదురు రాగా బయలుదేరి గంగాతీరమునకు ప్రయాణ మయ్యెను. పరమ ప్రీతిగా హృదయమునకు కెరటములు కొట్టునట్లు సంతోషము పుల్లింతలు కొట్టు చుండెను. ఎందులకో యెరుగని హృదయానందముతో గంగాతీరమునకు తులసీదాసు వచ్చి యచట పరిశుభ్రమగు ప్రశాంత స్థలము చూచుకొన్నాడు. దానిని పరిశుభ్రపరచినాడు తనతో తెచ్చుకొన్న కమండలముతో గంగా జలము గొనితెచ్చినాడు.

ఆ ప్రదేశమంతయు శుభ్రపరచుకొన్నాడు. పిమ్మట సమీపారణ్యము నుండి కొన్ని కర్రలు తెచ్చుకొని పాతి యా పైన చిన్న కర్ర లడ్డముగా తీగలతో బిగించి యొక శాల నిర్మించుకొన్నాడు. అంతవరకు యెండ తగుల కుండా పైన బట్టవైచి యుంచినాడు. మెల్లగా నా యడవిలో పడిపోయిన యాకులను పెద్దవాటిని పైన పరచినాడు.

ఇట్లు క్రమముగా నాశ్రమము నిర్మించుకొని యందుండ సాగెను. ఆ యాశ్రమములో పూవుల మొక్కలు, తులసి మొక్కలు పూజా ద్రవ్యము లుగా నుంచుకొనుటకు వేసి పెంచసాగెను. ఆతడు నిత్యము గంగాస్నానము గావించుకొని స్నాన సంధ్యాదులు తీర్చుకొని రామనామము జపింప

సాగెను. రాను రాను రామనామ జపము వృద్ధిచేయుచు తరువాత తీర్థ జలము తన యాశ్రమమునకు నంటియున్న యొక పెద్ద రావిచెట్టు మొదలున పోయుచుండెను. ఆతడు ప్రతి దినము యిట్లు తీర్థ జలము పోయుచు కొన్ని సంవత్సరము లట్లు సాగించుచుండెను. నానాటికి తులసీదాసు హృదయపక్వము గాజొచ్చెను. ఇట్లు యోగనిష్ఠలో నాతడు సంవత్సరముల కొలది యుండి తపోశక్తి పెంచసాగెను. లక్ష్యము చక్కగా కుదిరినది. తదేకధ్యానముతో రామనామము జపించుచుండెను.

ఇంతవర కాయన కుపదేశించిన వారు లేరు. గురువుగా నెవరు నిల బడలేదు. రామనామము జపించుచుండుట తప్ప మంత్రజపము అంగ న్యాసాదులతో చేయుట యెరుగడు. పరమ భక్తితో నిర్మల హృదయముతో నాత డుండెను భార్యా విషయ మిట్లాలోచించెను. నే నెంత సుకృతము గత జన్మములో చేసినాను. నాకు యిటువంటి భార్య దొరకినది. భార్య యనగా భోగమునకు తగిన వస్తువుగా లోకసామాన్యము భావింతురు. భార్య యన్న నేమో నాకు నేటికి తెలియ వచ్చినది. నా హృదయ పీఠములో గురు స్థాన మాక్రమించి నన్ను యిటువంటి మహా బలముగలదైన తేజమును దర్శింప జేసినది. నా కుటుంబ భారము తాను మోయుచున్నది నన్ను స్వేచ్ఛగా రామసేవలో నుంచినది.

ఇటువంటివారు యింటికి దీపములు. ఇప్పుడిప్పుడు నా భార్యయొక్క యుపదేశములోని బలము రామనామము జపించుటలో పెనవేసికొని పోయి నది. నా జన్మకు సఫలిత యా దివ్యోపదేశముగదా! యని భార్యను తలచు కొని చేసిన మహోపకారమును స్మరించుచు కాలము జరుపుకొను చుండెను.

# తులసీదాసు - బ్రహ్మరాక్షసుడు

ఆశ్రమము నిర్మించుకొని నిత్యం గంగా స్నానం చేయుచు ప్రతి నిమేషము రామ నామం జపించుచు జపానంతరం తీర్థ జలం శేషించినది యశ్వత్థ వృక్షము మూలములో 'పోయుచుండగా రామ నామ' జప తీర్థము లోని మహిమ యెక్కువగా తెలియు టాతని కంటబడ లేదు. కాని దాని మహిమ మా యశ్వత్థ వృక్షమూలమునుండి పెద్ద కొమ్మలకు పలవలకు నాకులకు పట్టినది. దాని బలము వృక్షమునకు పట్టినది. అది పట్టుట యెట్లో తెలియక పోయినను దాని మహిమ విచిత్రముగా బయట పడినది. ఆ వృక్షముమీద చిరకాలంనుండి యనగా కొన్ని వందల సంవత్సరముల కాలముగా నొక బ్రహ్మ రక్షస్సు దానిమీద నివాసంగా నుండసాగెను. ఇంత కాలము నుండి యది తులసీదాసు చేయు రామ నామ తీర్థ జలము ప్రభావ ముతో పూర్వజన్మ జ్ఞానము గలిగినది. ఆ శరీరము వదలు కాలము వచ్చి నది. అట్లుండగా నొకనాడు ఇట్లు జరిగినది.

ఆనాడు మధ్యాహ్న సమయంలో తులసీదాసు జపము పూర్తిగావించి శేష మున్న తీర్థ మా రావిచెట్టు మొదట పోసెను. ఇట్లు పోసినవెంటనే యా రావిచెట్టునుండి వింత రూపంతో బ్రహ్మరాక్షసుడు క్రిందకు దూకి వచ్చి తులసీదాసు కాళ్ళు పట్టుకొని సాష్టాంగముపడి యిట్లనెను. "మహాత్మా! నా పూర్వజన్మ ఫలితం మీ రూపముగా నాకు దర్శనమిచ్చినది. నేను ధన్యుడ నైనాను. నా పాపిష్టి జన్మ ఈ రోజుతో తీరిపోయినది. నేను దివ్యమగు జన్మలోనికి పోవుచున్నాను. నాకై విమానం వచ్చును. నే నందుండి దివ్య

లోక వాసమునకు నీ ధర్మమున పొందగల్గుచున్నా" నని మ్రొక్కిన యాతని చూచి తులసీదాను తెల్లబోయి యిట్లనెను.

"ఇదేమి వింత? నీ వెవ్వడవు? ఈ చెట్టుపై యెన్నాళ్ళనుండి యున్నావు? నీ వెందుల కిట్లున్నావు? నీ చరిత్ర యేమి? నాకు సవిస్తరంగా చెప్పుము. నావల్ల నీకే యుపకారం జరిగినది? వినగా వినగా నీ చరిత్రము వింతగా తోచుచున్నది. వినిపింపు" మనగా నాతడిట్లు ప్రారంభించెను.

# బ్రహ్మరాక్షసుని చరిత్రము

"అయ్యా! నేను నా చరిత్రము విన్పింతును వినుము. నేను ద్రవిడ దేశంలో జన్మించిన వాడను. నా తలిదండ్రులు మంచి ప్రఖ్యాతిగలవారు. నా తండ్రులు నాల్గు తరములనుండి వేదము నేర్చి పెక్కుమంది శిష్యులకు పాఠములు చెప్పి వారి నందరను వేద పండితులుగా చేయుచుండిరి. మేము శిష్టాచారముతో కుటుంబము నడుపు కొనువారము. మాకు దురాన్నము దుర్దానములు లేవు. ప్రతి దినము నగ్ని కార్యములు తీర్చుచు పర్వకాలము లందు యిష్టులు చేయుచు పెద్దలు సంపాదించి పెట్టిన మాన్యములమీద పచ్చు నాదాయంతో నతిథి యభ్యాగతుల నాదరించుచు యన్నదానము చేయుచు గొప్ప కీర్తిగాంచినది మా కుటుంబము. మేము యిట్లుండగా నేను పుట్టిన తరువాత నాకు నుపనయన వయస్సు రాగా నుపనయము నా తలిదండ్రులు గావించిరి. ఉపనయనా నంతరం నన్ను వేద పాఠమున కొక గురువువద్ద ప్రవేశపెట్టిరి. నేను నా గురునివద్ద భక్తి వినయముతో వేదము వల్లెవేయ సాగితిని. ఇట్లు చాలకాలం వేదవిద్య నభ్యసించుచుండు కాలములో నాకు

నొక సహాధ్యాయుడు కలిసెను. ఆతడు నాతో కొంతకాలం చక్కగా నడ చెను. మే మిద్దరము కొన్నాళ్ళు వేదమును వల్లెవేసిన తరువాత బుద్ధి మారినది.

దేశాటనము చేయతలయు ననియు కాశీ క్షేత్రము దర్శింప వలయు నని వాంఛ బయలుదేరి యిద్దరం గురువుగారి వద్ద శలవుపొంది ప్రయాణ మైనాము. వేదము చదివిన వారముగాన మా విద్యను ప్రదర్శించుచు సాదర గౌరవము లందుచు కాలక్షేపము చేసినాము. అట్లు మహారాష్ట్రము, ఘూర్జర దేశము సంచారం గావించి కొంత ధనం సంపాదించుకొన్నాము. ఎవరి ధనం వారు దాచుకొని తిరుగుచు కాశీ క్షేత్రం ప్రవేశించినాము.

గంగా స్నానం చేసి విశ్వేశ్వర, వినాయక, అన్నపూర్ణాది దేవత లను దర్శించి యొక తీర్థ పుత్రుని యింట బస చేసినాము. ఆయనతో నుండి తీర్థ వాసులకు సాయపడుచు వారివలన ధనము కోరకుండా వా రీయగా పుచ్చుకొనుచు యచట స్థిరంగా నున్నాము.

మే మట్లుండగా యా తీర్థవాసుని పుత్రిక యొకతె యున్నది. ఆమె మాతో చనువరి తనముగా నుండసాగెను. కొన్నాళ్ళకు నా స్నేహితుడు యా కుమారితో సంబంధ మేర్పరుచుకొనెను. వా రిద్దరు రహస్య విధంగా సంచరించుచుండగా నేను దానిని సహించలేక పోయినాను. ఈ విషయమును నా స్నేహితుని బిలిచి "నీవు గురునితో తుల్యమగు వారింట గురుద్రోహ కార్యము చేయరాదు. నీ ప్రవర్తన నచ్చలేదు. పరకాంతను యందులో గురుతుల్యుడగు మహనీయుడు మన కాశ్రయమిచ్చిన యా పుణ్యాత్ముని యింట నుండి గురుద్రోహం చేయుట తగనిపని. నీవు జాగ్రత్తగా మసలు కొమ్మ"ని నేను యనేక విధముల నిందించితిని, దానితో వానికి నాయందు

కోపము పెరిగినది. నన్ను చంపివేయుటకు తన బాధ నివారించుకొనుటకు మనస్సులో సంకల్పించుకొన్నాడు కాబోలు నేనే మెరుగను. దీర్ఘ కోపం చాల ప్రమాదం గదా!

అట్లు వాని మనస్సులో మెదలుచుండు దుర్బుద్ధి నేను గమనించ లేదు. మే మిద్దరం తిరుగుచున్న కాలంలో నన్ను మట్టుపెట్ట దలపు వా రిద్ద రిలోను ప్రవేశించినది కాబోలు. ఒక పర్వ సమయము సాయంత్రంవేళ స్నానాదులు చేయదగిన గ్రహణ కాలము. చీకటిలో ధనార్జనమునకు తిరు గుచు గంగలో నిలబడి మంత్రములు చదువుచుండగా నన్ను యితరు లెవరు గమనించని రీతిలో గంగలోనికి నెట్టివేసెను. బలవన్మరణము గంగలో జరిగినను నాకుండిన వయస్సు కాలం శరీరము జరుగని హేతువుచే బల వన్మరణ ప్రారబ్ధముతో నేను చనిపోయి ఈ బ్రహ్మరాక్షసుని రూపమంది వేదము చదువుచు తిరుగసాగితిని. నేను వచ్చువారిని పోవువారిని బెదరించు చుండు కాలమున నొక మహామునిని బెదరించితిని.

ఆయన నా విషయము గ్రహించి గత జన్మ విషయము గుర్తించి జాలిపడి యిట్లనెను. నీవు గంగా తీరమున పవిత్రమగు నశ్వత్థ వృక్షముపై నిల్చియుండుము కొన్నాళ్ళ కొక మహనీయునివలని ఈ శరీరము వదలి దివ్య శరీర మందెదవు యని యాజ్ఞాపించి పోయెను. నీ వాయన కుపకారంగా సహాయపడుము. వేద పఠనముతో దివ్యజ్ఞానము గలిగి యుండుమని ననూ రార్చెను.

నాటి నుండి నేను యీపిప్పల వృక్షముపై వేదము చదువుకొనుచు మౌనముగా నిందే యున్నాను. నేను శరీరము వదలగల కాలము నీదర్శ

మున వచ్చినది నేను యింక యీపాడు శరీరము వదలెదను. నాకు దివ్య శరీరము పొందగల సమయమాసన్న మైనది. నాదోషములు వేదపారాయణ ముతోను నీవు రామనామ జపతీర్ధ శేషమునా నిలయమగు యీ మహా వృక్ష మూలమున పోయుటచే నేను పునీతుడనుగా నైనాను నాకు నీవలన మహోప కార మైనది. ఈ శరీరము వదలుటకు దివ్య దేహము దాల్చుటకు నీపుణ్యమే మూల కారణ మైనది. నేను నీవు చేసిన యుపకారము మరువ జాలను నీవలన యీపాడు శరీరము బాధ. శాంతి పొందినది. అంతవరకు మంటలు వికృతరూపము నన్నావహించి యున్నవి. ఒక మహాను భావుని దయవలన దివ్య దృష్టితో మీరాకయు. మీవలన నేను యీశరీరము వదలుటయు, దివ్య దృష్టితో ముందురాగల శరీరమును గ్రహించగల్గితిని.

ఇప్పుడు యిన్నాళ్ళ నుండి నీవు చేయు రామనామ జపము సఫలత గాంచినది. కాని గురుని యుపదేశముతో తారక మంత్రము గ్రహించిన గాని శుద్ధి యేర్పడదు. నాకు యిటువంటి మహోపకారము గావించిన నీకు సమర్ధుడగు గురువును చూపించెదను. ఆయన నారద మహాముని. ఆమహాముని నారాయణునకు ప్రియ భక్తుడు ఆయన యెరుగ నిది లేదు నీకు మహోపకార మా మహానుభావుడు చేయుననగా విని "ఓపుణ్యాత్మా! నాకు నారద మహాముని దర్శన భాగ్యము కల్గింతువా? నేను మానవుడను ఆయన దేవముని, ఇది యెట్లు సాగును? సందర్భము కుదర లేదన్నా"డు అదివిని యీబ్రహ్మరాక్షసరూపు డిట్లన్నాడు.

నారద మునీంద్రుడు త్రిలోక సంచారి. ఏలోకములో తిరిగిన యాలోక వాసుని రూపము ధరించును. వీణాగానము గావించును. ఎక్కడకో వెళ్ళవలసిన పనిలేదు. ఈదారిని బ్రాహ్మణ రూపముతో రేపు పోవును

ఆయన వెంటబడుము నీకు శుభమగునని చెప్పెను తన శరీరమతడు చూచుచుండగా వదలి దివ్య దేహముతో విమాన మెక్కి పోయెను.

## నారద దర్శనము - తారక మంత్రయోగము

ఇట్లు చెప్పిన యాబ్రహ్మణజీవి దివ్య శరీరముతో పోయిన తరువాత తులసీదాసు యిట్లాలోచించెను. నాజన్మకు ఫలితముగా యీసంఘటన సమకూరినది. నా భార్య రూపముతో కేవలము రామప్రభువు తనయను గ్రహము నాయందునిల్పి యిట్లు గంగా తీరవాసము రామనామ జపము నాజప సిద్దికి తగినట్లు నారదమహామునీంద్ర దర్శనము యిన్ని యెట్లు సమకూర్చినాడో! యెంతటి యాశ్చర్య విషయము నాకు మహోత్తరమగు సాయము చేయుటకు యీ పిప్పలి వృక్షప్రాంతము నందు పర్ణశాలయు నాశ్రమము కట్టుకొను యోగము వచ్చినది కాబోలు. ముందేమి జరుగునో శ్రీరామ ప్రభునిదయగా భావించ తగునని యారాత్రి తనకు రేపు జరుగు సన్నివేశమును గురించి తదేక ధ్యానముగా నుండెను తెల్లవారుజాముననే లేచి నిత్యకృత్యములు తీర్చుకొని గంగా స్నానమాచరించి శుచిర్భూతుడై యుండెను.

ఇట్లాతడు దారి కని పెట్టుకొని యెవరు తిరుగ జాలని యరణ్య మార్గమును బట్టి వచ్చుచున్న యొక వ్యక్తిని వీణ భుజముపై పెట్టుకొని వెళ్ళుచు విసరుగా నడుగులు వేయు యొక బ్రాహ్మణుని తిలకించెను. అట్లు చూచి యాతడు విసురుగా తన ప్రక్క నుండి పోవుట గమనించి యాయన వెంటనంటి మహా వేగముతో తాను కూడ పోవుచుండెను కొంత దూరము

పోయిన తరువాత వెనుదిరిగి చూచి తనను వెంబడించి తులసీదాసును చూచి కసరి "నీవెవడవు? ఎందుకు నన్ను వెంబడించుచున్నావు? పో; వెనుకకు పో; రావలదని" విసురుగా తీవ్రముగా చీదరించెను తులసీదాసు నారద మహామునిని చూచి కాళ్ళు పట్టుకొని యిట్లనదొడగెను.

మహానుభావా! నీవు దేవమునివి. నేను యేశరణ్యము లేని సామాన్యజీవిని. నిన్నాశ్రయించి రామతారక మంత్రముపదేశమందదలచితిని నాపున్నెము కొలది మీదివ్య దర్శనము లభించినది. ఇది నాపూర్వజన్మ ఫలము మిమ్ము నాకుపదేశము వరకు వదలను. నన్ను తరింపజేయుడని" ప్రార్థించెను.

నారదుడు యెంతయో కసరెను. చీదరించెను. తొలగద్రోసెను. ఎన్ని చేసినను తన్ను వదలని తులసీదాసుపై ప్రేమ కలిగినది. తన కాళ్ళు పట్టుకొని వదలకుండా యున్న తులసీదాసుపై ననురాగము కలిగి యిట్లనెను. "నీ వెవరి వాడవు? నన్ను యెందులకు వెంబడించినావు? నీ యుద్దేశమేమి? ఏమి వాంచించితివి?" యని ప్రశ్నించెను.

తులసిదాసు చేతులు జోడించి "నేను సామాన్య మానవుడను. శ్రీరామచంద్ర దర్శనము కోరి యిక్కడ రామ నామము జపించుచున్నాను. నాకు తారకమంత్రం ఉపదేశించగా మిమ్ము ప్రార్థించుటకు వేచియున్నాను. నాయందు దయయుంచి రామ తారక మహా మంత్రము విది విధానముగా మీ రుపదేశింప సాష్టాంగపడుచున్నా" ననెను. "నేను యెవరి నని యడుగు చున్నావు. సామాన్య బ్రాహ్మణుడను. నీ కుపదేశము చేయ సమర్ధుడనా? ఎందుల కీ వెర్రి యాశని" యన్నాడు.

స్వామీ! మిమ్ము నే నెరుగను. చూడజాలను నా పుణ్యముకొలది యీ రావిచెట్టుపై నుండిన బ్రహ్మరాక్షస్సు మిమ్ము గురించి చెప్పినది. నా వలన తాను తరించినా ననియు, నన్ను తరింపజేయుటకు నారదమునీంద్రుడు రేపు ఈ దారిని వీణ పుచ్చుకొని వెళ్ళుననియు. నీ వాయన పాదములు పట్టుకొని తారక మంత్రోపదేశ మందుమని సలహాచెప్పి విమానమెక్కి వెళ్ళిపోయెను. నిన్నటినుండి తమ రాకకై యెదురుచూచుచున్నాను. నా జన్మ తరించినది. దయయుంచి నన్ను కృతార్థుని చేయమని వేడుకొనెను. తులసీదాసు పుణ్యము గొప్పది. శ్రీరామచంద్రస్వామి యనుగ్రహం పొంద గల పుణ్యం చేసిపెట్టుకొన్నాడు. నారదమునికి దయ గలిగినది. అతని ప్రార్థన మంగీకరించినాడు. అట్లంగీకరించి సమాధానముగా నిట్లన్నాడు.

భక్తాగ్రేసరా! నీవు కోరిన కోరిక తగినదే! నన్ను రామతారక మడిగినావు. నీయందు నాకు ప్రేమ దైవబలంచే కలుగుచున్నది. నేను నీకు రామతారక మంత్ర ముపదేశింప తగిన సామర్ధ్యం గలవాడను కాను. నీకు వలసిన తారకమంత్రోపదేశ కర్తను తెలియజేయుదును. నీ వాయన నాశ్ర యింపుడు. నీకు తప్పక కార్యజయము. శ్రీరామ దర్శనమగు ననెను.

అది విని తులసీదాసు నారదమునీంద్రునితో నిట్లనెను. స్వామీ! నా కోరిక తీర్చక దాటించుటకు యిట్లు మాట్లాడుచున్నారా? నేను మీవాడను. నాయందు దయయుంచి నన్ను త్రోసిపుచ్చకు డనెను. నారదుడు నవ్వి యిట్లనెను. నాకు నీ యందు ప్రేమ కుదిరినది. నీవు యింకొక విధముగా నెంచకుము. నేను మహామహుడు నాకన్న శ్రీరామ భక్తాగ్రేసరుడు నిరంతరము రామ తారక మంత్ర నిష్టలో నున్న జగత్ప్రశస్తుని నీకు గురువుగా చేయదలచినాను. నీ యోగము గురించి యోచించియే నీ కొరకై యీ [illegible]

నీయందు పుత్ర ప్రేమతో నేను భావించి చెప్పుచున్నాను వినుము. ఆ మహానుభావుడెట్లు నీకు దొరకునో వివరింతును వినుము. నీవు భవిష్యత్తులో గొప్పవాడవగుదువు. శ్రీరామ దర్శనము కలుగును. నీ గురువు నీకు శ్రీ రాముని గొనివచ్చి చూపును. వినుచున్నాడు.

పిదప యిట్లారంభించెను. ఇచట కనతిదూరములోనేగదా కాశీపట్టణమున్నది. ఆ పట్టణములోని వారందరూ భక్తిపరులే! వారిజన్మ విశేషముతో కాశీవాసులైనారు. అట్టి కాశీపట్టణములో తూర్పు భాగమున గంగా తీరమునందొక బ్రాహ్మణ గృహము కలదు. అతడు సదాచార సంపన్నుడు. మహా భక్తుడుగా నుండును. ఎందరు వచ్చినను లేదనకుండా నన్నదాన మా పట్టణములో చేయు ప్రముఖులలో నొకడు. వారింట నిత్యము భక్తజనులు రామనామ సంకీర్తనములు గావించుచుందురు. అట్టి బ్రాహ్మణ గృహములో సాయం సమయంలో శ్రీమద్రామాయణము పురాణ కాలక్షేపము జరుగుచుండును. కొన్ని వందలమంది భక్తులువచ్చి శ్రీరామ చరిత్రమాలకించుచుందురు.

వారిలో మనకు కావలసిన ముఖ్యుని వివరింతును వినుము. పురాణము ప్రారంభము కాకుండా ముందుగావచ్చి యీశాన్యమూల కూర్చుండు ముసలి బ్రాహ్మణుని గుర్తుపెట్టుకొనుము. ఆ బ్రాహ్మణుడు పురాణము ప్రారంభించినది మొదలు చివరవరకు తలవంచి కన్నీళ్ళు గార్చుచు చివర పురాణమునకు స్వస్తి చెప్పిన తరువాత లేచి బయలుదేరును. ఆతడు ముసలివాడైన వేగములో నంతవాడు లేడు. లేచి చీకటిపడు సమయములో విసవిస నడచుచు నీ యాశ్రమమునకు కొలది దూరములోనున్న కాలిబాటనుపట్టి చీకటిలో పోవుచుండును. నీవు చేయవలసినది యిప్పుడు చెప్పుచున్నాను. ఆయన

బయలుదేరగానే నీవాయనను వెంబడించుము. నీ యాశ్రమముగుండా పోవుచుండును. నీ యాశ్రమము దాటువరకు వెనుకపాటుగా నా మహాత్మునితో నడువుము. తరువాత దట్టమగు నడవిలోబడి పోవుచుండగా వెంటాడుము. ఆయన కొంతకు తిరిగిచూచును. నిన్ను చూడగనే "నీవెవడవు? నాతో యీ చిమ్మచీకటిలో నెందులకు వచ్చెదవు? పో పొమ్మని కసరును. గద్దించును. హూంకరించును. నీవు భయపడకుము. రెండుకాళ్ళు పట్టుకొని చుట్టివేయుము. నిన్ను యెందులకు నా కాళ్ళకడ్డుపడెదవని యప్పుడు ప్రశ్నించును. నాకు శ్రీరామతారక మహా మంత్రము నుపదేశించుడు. అంతవరకు వదలనని గట్టిగా పట్టుకొనుము.

అదివినిన తరువాత నేనుపదేశించుట యెట్లు? నేను సామాన్యుడను బ్రాహ్మణుడనని యనును. అప్పుడు యిట్లు చెప్పుము. మీరు నన్ననుగ్రహింపుడు. నాకు గురువుగా మీరుండవలయును. మిమ్ము నేను వదలను. మీరు సామాన్య బ్రాహ్మణులుగారు. దేవకోటిలోనివారు భూలోకములో జనులను నుద్ధరించుటకు సామాన్య వేషములు ధరించి తిరుగుచుందురు. మీరుకూడా దేవతాపురుషులుగాని సామాన్య వృద్ధ బ్రాహ్మణులుగారు. మీ విషయము నేను వినియే మిమ్మాశ్రయించుచున్నాను. మీరఖండ రామతారక మంత్ర పరాయణులు నా గురుదేవులు మారుతీ పుత్రులుగా నెరిగితి ననుము. ఆయన గద్దించి "నీకు నా విషయము యెవరు చెప్పినారని" ప్రశ్నించును. నీవిట్లు చెప్పుము.

స్వామీ! మీ విషయము నేను తెలియ సమర్థుడనుగాను. సమర్థులైన నారద మహామునీంద్రులు చెప్పి మిమ్మాశ్రయించమన్నారనుము. ఆయన వెంటనే "యెక్కడున్నాడు నారదుడనును. ఈ శరీరము నాకెందుకని

చితిపేర్చుకొని శరీరము వదలినాడనుము. లేకున్న మనలనిద్దరను తోకకుచుట్టి త్రిప్పికొట్టును సుమా! ఇది మార్గము. నీకు వాయునందనుడు సంతత రామ తారక జపదీక్షితుడు గురువుగా చేయుదును. భయపడకుము. ఆయన చాలా దయశాలి. తనపేరు చెప్పుకొన్నవారికి మితిలేని బలము. ధైర్యము. శౌర్య జయము. రామచంద్ర దర్శనభాగ్యము, రోగరహిత జీవితము తప్పక కల్పించును. ముందు నీ హృదయము పరీక్షించుటకు హూంకరించును. నేను పంపించానన్న నీకడ్డు చెప్పడు. లేకున్న నీవు రామదూతనుగ్రహించగలవను కొనడు. నేను పంపినానన్న నిన్ను శోధించిగాని పంపనని యెరుగును. నీకు మహాయోగము పట్టనున్నది. లేకున్న నేనగుపించను. నీకు గురువును కుద ర్చను. మున్ను రామాయణ గ్రంథకర్త వాల్మీకిని ప్రోత్సహించినది నేనే. ఈనాడు నిన్ను రెండవ వాల్మీకిగా చేయదలచి యా బ్రహ్మరాక్షసుచే చెప్పిం చినది నేనే. నీవు రామకథామృతము భక్తి తన్మయత్వముతో విచిత్ర గతు లతో వ్రాసి చిరకీర్తి పొందగలవు. ఇదినాయాశీర్వచనమని దీవించి నారదుడు వీణాగానము చేయుచు శ్రీహరి స్మరించుచూ పోయెను.

తులసీదాసు యిది యంతయు తలచుకొని చెప్పరాని సంతోషము, భయము, గగురుపాటుతో పోవసాగెను. నేనేడ? నారదమునీంద్రుదేడ? మానవమాత్రుడాయనను దర్శింపగలడా? ఆయన దయ సంపాదించగలడా? నేను నిజముగా సంపాదించినానా? నాకప్రయత్నముగా నీ యాశ్రమజీవితము. నారద వృత్తాంతము. మహాముని సందర్శనము యెన్నోజన్మల పుణ్యఫలము ఈ జన్మలో చేసినదికాదు. నేను మహాముని నాశ్రయించగా నాకు తగిన గురుడని వాయునందనుని విషయము వివరించెను. అది యంతకన్న కష్ట సాధ్య విషయముగాదా?

నేను మానవలోకములోనున్నను దేవలోక వాసులతో నను బంధము యెంత ఘనమో! నేను వర్ణింపగలనా? శ్రీరామ సేవా దురంధరుడు హనుమంత మహాశముని గురువు పొందగల యోగ్యత నారదమహాముని వలనగదా ప్రాప్తించనున్నది నేను ధన్యుడను. నా భార్యకోర్కె తీరగలదని యట్లే నిష్టగా తన యాశ్రమమున నుండెను.

# ఆంజనేయస్వామి తారక మంత్రోపదేశము

మనస్సులో పరిమితానందము నందుచుండెను. ఒకప్రక్క భయముకూడ వేధించుచుండెను. నేను మహావీరుడగు నాంజనేయస్వామిని కలుసుకొనగలనా? నా కార్యసాధనమగునా? నేనందులకు తగినవాడనా? అట్టి మహాగురుని పాదమంటి రామతారక మంత్రముపదేశమందగలనా? ఇది కల లోని మాటగా నెరగవలయును. కానీ మహామునీంద్రుడు నాకు యోగము లేకున్న యింతగా వివరముగా చెప్పునా? తప్పక సంసార విమోచనమంద గలను. శ్రీరామచంద్ర స్వామిదర్శనము నా గురుదేవుడు చేయించే తీరును సందియములేదని తదేక ధ్యానముతో నున్నాడు. ముందు తానాచరించవలసిన విధానమును యోచించుచుండెను. మరునాడు తులసీదాసు వేకునలేచి గంగా స్నానముచేసి శ్రీరామనామము జపము గావించుచు సాయం సమయము వరకట్లే యుండెను.

సాయం సమయమునకు కొంచెము ముందుగా బయలుదేరి కాశీ నగరములోనికి ప్రవేశించెను. నారదమహామునీంద్రుడు చెప్పిన గుర్తులనను సరించి తిన్నగా గందతీరమునసున్న బ్రాహ్మణ గృహమునకు పోయి

దూరముగా నిలబడి నిదానించుచుండెను. ఇంతలో పురాణ శ్రవణమునకు శ్రోతలువచ్చి చేరుచుండిరి. ముందుగా మునీంద్రుడు చెప్పిన మహాశ్రోత వృద్ధ బ్రాహ్మణుడువచ్చి యీశాన్యదిశలో మూలగా కూర్చుండెను. స్త్రీ పురుషాదులు రామనామ సంకీర్తనలు చేయుచుండిరి. పిదప పురాణమారంభించిరి. తులసీదాసు కూడా వినువారితో నొకప్రక్కగా తాను కూర్చుండెను. రామాయణము వినుచుండెను. పురాణము సమాప్తమైన తరువాత నందరులేచి పోయిరి.

తానెవరికై చూచుచున్నాడో యా మహామహుడు వృద్ధబ్రాహ్మణ రూపధారి లేచి విసవిస నడచుచు పోవుచుండెను. తులసీదాసు వాని ప్రయాణము నడక విమర్శగా చూచుచు దూరదూరముగానుండి తన యాశ్రమము వరకు వచ్చి యందు ప్రవేశించెను. తాను నారదమునీంద్రులవారి బోధనంతయు జ్ఞప్తికి తెచ్చుకొనుచుండెను.

ఇట్లు కొన్నాళ్ళు సాయం సమయమునకు తన స్థానమునుండి బయలుదేరి పురాణము జరుగు గృహమునకు పోయి వినుచుండు వారి మధ్యలో కూర్చుండి శ్రీరామ చరితామృతమును చెవుల పండువుగా వినుచుండెను. ఇట్లాతడు భయము, సంతోషముతో నెట్లా మహాబలుని దర్శనము చేయుదునా? మహా మంత్రములు పొందుదునా? యని తహతహలాడుచుండెను. చివర కొకనాడు సాహసముగా గురుదేవుని కలుసుకొనవలయును మహామంత్ర ముపదేశ మందవలయునన్న పట్టుదల వహించెను. ఆ నాడు మునుపటికన్నా హెచ్చుగా రామనామ జపము గావించెను. సాయం సమయము కావచ్చినది. కాశీనగరమునకు ప్రయాణమయ్యెను. గంగ

గట్టునయున్న చరిత్రాత్మక గృహమునకు జేరెను. అందరికన్న ముందుగా వచ్చి కూర్చున్న మారు రూపమువానిని గరుదేవుని పరికించి చూచెను.

ఇదివరులోవలెనే ప్రవేశించి కూర్చుండెను. పురాణము జరుగు చుండెను. ఈ మహాభక్తుడు కన్నీళ్ళు గార్చుచు పురాణము జరుగుతీరు కన్లే యుండెను. పురాణమాఖరున స్వస్తియైనది. అందరూ లేచి వారి వారి తావులకు పోవుచుండిరి. ఈ వృద్ధబ్రాహ్మణుడు కూడా లేచినాడు. ముసలి తనము పాటించని నడకతో చరచర పోవుచుండెను. మన కధానాయకుడా దినమున సాహసముగా వెళ్ళిపోవుచున్న బ్రాహ్మణుని వెంటబడి పోవు చుండెను. ఆయన తలవంచుకుని పోవుచుండగా వెనుకబడి పోవుచు తన యాశ్రమము దాటెను. అట్లు దాటిన మహనీయునితో తాను కూడా నడు గులో నడుగు కలుపుచు పోవుచుండెను.

దారి చీకటిగా నున్నది. దట్టమైన పొదలు. మహావృక్షములు క్రూరమృగములు నిండిన ప్రదేశముగా నున్నది. సంశయము విడచి మారు మాటాడలేకుండా పోవుచుండెను. కొంత దూరము పోయినతరువాత మహా భక్తశిఖామణి వెనుదిరిగి చూచెను. తన్ను వెంబడించుచున్న తులసీదాసును చూచి యిట్లనెను.

ఎవరునీవు? యీ చీకటిలో నాతో వచ్చుచున్నావు? ఇది మహా రణ్యము తెలియదా? ఎందులకు ఈ సాహసముతో వచ్చినావు? పో! పో! తిరుగుతావా? లేదా? యన్నాడు. ఒక్క యురుమురిమినట్లుగా నాంజనేయ స్వామి యన్నాడు. అదివిని గడగడలాడుచు తలసీదాసు మిమ్ముల వదలజాలను. మీరుతప్ప నాకు వేఱుదిక్కులేదు. మీరు మహానుభావులు. దివ్యమగు శ్రీరామ తారకమంత్ర పారాయణులుగా నెరిగితిని. నేను మిమ్మొ

శ్రయించగా వచ్చుచున్నాను. నాయం దనుగ్రహముంచి శ్రీరామచంద్ర స్వామిని దర్శనము చేయించగల తారకమంత్రము నా కుపదేశము గావించుడు. నేను మిమ్మాశ్రయించుచున్నాను. నావంటి దీనుని దయతో చూడ గల మహామహులు మీరు. మిమ్ము వదులజాలను. నా హృదయ తాపము మిమ్ము దర్శింపగా తీరుచున్నది. మీరు దయాస్వరూపులు. మీవంటి వారి దర్శనము పూర్వార్జితపః ఫలముగా భావించుచున్నాను. నన్ననుగ్రహింపుడని కాళ్ళుపట్టుకొని గట్టిగానిలబెట్టెను.

ఆంజనేయస్వామి బ్రాహ్మణరూపముతో నున్నాడుగదా! దానికి తగినట్లే యిట్లు మాట్లాడసాగెను. ఓయీ! నీవు యెవరినిచూచి యెవరనుకొనుచున్నావో! నేను ముసలి బ్రాహ్మణుడను. పెద్ద తనములో శరీరము వణుకుచున్నది. ఎవరూ లేనివాడను. ఒంటరి జీవితమీ యడవులలో చేరి జరుపుకొనుచున్నాను. నీవు నావంటి ముసలివాని వలన యే ప్రయోజనము పొందెదవు? నాకు లేనిపోని బెడద తెచ్చిపెట్టెదవా? యీ బ్రతుకు సాగనీయవా? ఎందులకీ యాతన? చెప్పినమాట వినుము. వినకున్న నిన్ను యేమి చేయుదునో చూడుమని గద్దించెను.

ఆయన మాటలు విన్నాడు తులసీదాసు. మనస్సు కొంత కుదురు పరచుకొన్నాడు. మనము బింకముగా సమాధానము చెప్పవలెను. నేనుకూడా యెరుగనట్లు యెదుట నిలచి నాకు మంత్రోపదేశము చేయమందును. నా స్వామి విని నీకెవరు చెప్పినారనును. అప్పుడు కథనంతయు ముందు పెట్టెదను. నా వాంఛితము తీర్చ మందుననుకొని యిట్లనెను.

మీరు పెద్దవారు. వృద్ధ బ్రాహ్మణులు జప తపములందారితేరినవారు. శ్రీ రాముని సేవ బాల్యమునుండి చేసి పండిన మహానుభావులు,

బ్రాహ్మణ మూర్తులు. వేద ధర్మవిదులు, బహు శాస్త్రవేత్తలు, ఈశ్వరాను గ్రహ పాత్రులుగా నుండకుందురా? ఎంత పెద్దవారైన యంత భక్తియుక్తులై యుందురు. నన్ను దయయుంచి. శిష్యునిగా భావించి చేరదీసి మంత్రోప దేశము గావించుడని ప్రాధేయపడెను. స్వామికి మనస్సులో దయ గలిగి నది. కాని తన్నావవాలు పట్టినవాడా? భక్తియొకటే మనస్సులో నుంచు కొని మాట్లాడుచున్నాడా? వాని హృదయము గ్రహింతునని యిట్లారంభిం చెను. "ఏమయ్యా! నన్ను పట్టుకొని యెందులకు వేధించెదవు? నీకెందులకీ బాధ? ప్రపంచములో నెందరో యుండగా నన్ను పట్టుకొని యెందులకు పీడింతువు. నా దగ్గరకు రాకుము. ఫో!ఫో! యెందులకీ పీడ" యని యొక్క త్రోపు తోసెను.

ఆతడా త్రోపు తోయగా తులసీదాసు తూలిపడి మరలవచ్చి కాళ్ళు పట్టుకొని "మీరు యెంత త్రోసినను వద్దన్నను మిమ్ములను వదల జాలను. దయతో నన్ను చూడుడు, మీరు తప్ప నా కోరిక యింకొకరు తీర్చలేరు. మీ వలననే నా వాంఛితము తీరవలయు నని నిశ్చయించుకొన్నాను. నన్నెంత త్రోసినను మిమ్ము వదలజాలను. నా మాటను త్రోసివేయక దయతో చూడుడు. నేను మిమ్ము సామాన్యులుగా భావించలేదు. మీ విష యము నేను తెలియవలయుననియే యున్నాను, మీ సేవతో నేను తరింతును నా దీక్ష భంగము చేయకుడు. మీరు నన్ను దాటిపోకుడు. మీ పుణ్యముతో నేను గట్టెక్కగలను." యని కన్నీరు గార్చుచు పాదములమీద వ్రాలెను.

ఆతని చూచి యనుగ్రహము నంది వాయునందను డిట్లనెను. నీ కీ పట్టుదల యెందులకు? నాకేమి వచ్చును? నా నుండి నీవేమి గ్రహింతువు వెర్రి భ్రమలో పడినావు? ఎందులకింత బాధ? సమర్థుడగు గురువును వెదకి కొని నీలోని కోర్కె తీర్చుకొను మనెను.

దానికి తులసీదాసు తాను గ్రహించిన విషయము బయట పెట్ట దలచి యిట్లనెను. స్వామీ! మీరు సామాన్యులుగారు. మిమ్ము నేనొక మహాను భావునిగా గ్రహించినాను. ఇప్పుడు లోకములో తిరుగుట కెవరికీ తెలియ బడకుండా నుండుటకీ రూపములో నున్నారు. అఖండ రామసేవాపరులుగా మిమ్ము విన్నాను. నా పున్నెముకొలది యీ మహాత్ముడు మీ విషయము నా కెరింగించినాడు. నా కోరిక మీవలన తప్పక తీరునన్నాడు. మిమ్ము గుర్తుంచు కొని పట్టుకొమ్మని చెప్పినాడు. ఆ గుర్తుతో మిమ్ము గ్రహించి మీ పాదసేవ చేసి మంత్రోపదేశ మందదలచినాను. ఇది నా విషయమనగా విని, యీత డెరిగినదేదియో వినదలుతును చెప్పుకొని పోనిమ్మని నా విషయము నీకాత డేమి చెప్పినాడన్నాడు. దానికాతడిట్లు చెప్పెను. ఓ స్వామీ! మీ సంగతి వారు చెప్పినది వినండనెను.

కాశీ పట్టణములో గంగాతీరమున తూర్పుతట్టున యొక బ్రాహ్మణ గృహము గలదు. అక్కడ ప్రతిదినము రామాయణము పురాణ కాలక్షేపము జరుగుచుండును. ఆ కాలక్షేపమునకు పెక్కుమంది భక్తులువచ్చి విని సంతో షించుచు పోవుచుందురు. వారందరూ రామనామ సంకీర్తనము గావించు చుందురు. స్త్రీ పురుషాదు లెల్లరూ మహాభక్తులు వారిభక్తి పారవశ్యము వర్ణించలేను. ఆ వచ్చిన జనములో చెప్పుకోదగ్గ వ్యక్తి యొక్కడు ముఖ్యు డున్నాడు. పురాణము ప్రారంభమునకు ముందుగావచ్చి యీశాన్య మూలలో నొదిగి కూర్చుండును. ప్రారంభమునుండి కన్నీళ్ళు గార్చుచు పురాణము పూర్తియగుదాక యుండి విసవిస లేచి నడచిపోవు వృద్ధ బ్రాహ్మణుడు నీకు మంత్రోపదేశము చేయ సమర్థుడు. ఆయన వలన నుపదేశమందమనెను.

నేనా మాటలువిని వెంటనే యానాడు కాశీ నగరమునకు వచ్చి యా బ్రాహ్మణుని యింటికి వచ్చితిని మిమ్మందరినీ చూచితిని. ఆయన చెప్పిన గుర్తులననుసరించి మీదారిని పోవుదురని మీ వెంటబడుటకు కొన్ని రోజులు యత్నము చేసినాను. ఈనాటికి నా యత్నము సఫలమైనదన్నాడు.

అది యాంజనేయస్వామి యిట్లన్నాడు. నన్నే యింతగా పట్టుకొని మంత్రము పొందమని యన్నవారెవరు? వాని సంగతి కనుగొందును. లేని పోనివి చెప్పిపెట్టి నిన్ను మోసగించునా? అంతటి మాటకారి. మోసకారి యెవరు? నాకు చెప్పుము. వానిని కలుసుకొని నిలదీసి యడుగుదునని హూంకరించెను. తులసీదాసు విని భయపడక "స్వామీ! నేను మీముందు యేమి దాచగలను? మిమ్ము నాకా మహానుభావుడు మహా రామభక్త శిఖామణి యాంజనేయస్వామిగా చెప్పినాడు. మీరు నిజముగా వాయుపుత్రులు నావంటి దీనులను కాపాడగల మహా ప్రేమమూర్తులు. నేను విన్నాను. నన్ను మోసగించగా తలపకుడు. నాయందు దయ యుంచుడని యెంతో భక్తి. వినయములు ప్రకటించుచు ప్రార్థించెను. దానికా వానర ప్రభువు సంతోషమంది వాని కభయ హస్తము శిరమునబెట్టి "సరియే! దానికేమి? నీవు నన్ను యెట్లు గ్రహింపగా నాతడు తెలియజేసెను. అంతవాడెవడు? ముందు నాకా సంగతి చెప్పుమనెను.

నాదీన చరిత్రము మీకు విన్పింతును వినుడు. మీరెరుగనిది లేదు కాని మీముందు నా విషయము చెప్పుకొనుట నాకు శ్రేయస్కరము. వినుడు. నేను తులసియను నామము వాడను. కామబలముతో నర్ధరాత్రము మహాసర్ప మును త్రాడుగా భావించి గోడదాటులోన యా పాము మూడు ముక్కలుగా తెగినది. రక్తపు చారలతో నా భార్యను పిలువగా వచ్చి నా రక్తమయమగు బట్టలుచూచి భయపడి వస్త్రములు వదలజేసి నాకు తత్త్వోపదేశము చేసినది.

శ్రీరామచంద్ర దర్శనానంతరముగాని నావద్దకు రావద్దని యంతవరకు నిల్లు దిద్దుదునని చెప్పి పంపినది. గంగా తీరములో పర్ణశాలవైచుకొని రామ నామము జపించసాగితిని.

జపానంతరము తీర్థమొక యశ్వత్థ వృక్షమూలమున పోయు చుంటిని. దానిపై చిరకాలముగానున్న బ్రహ్మరక్షస్సు క్రిందకుదూకి నాకు నమస్కరించి మీ రామనామ జపతీర్థ మహిమచే యీ పాడుజన్మ పోవు చున్నది. నాకు దివ్య విమానము వచ్చును. నీ యుపకారము మరువజాలను. దీనికి బదులుగా నొక యుపకారము చేయుదును వినుము.

నీవు చేయుచున్న రామనామ జపమునకు తగిన గురూపదేశ మందుము. శ్రీరామ తారకమంత్ర ప్రభావముతో ఘనుడవయ్యెదవు. గురూప దేశములేని మంత్రము పట్టుగా పనిచేయదు. కావున నీకు తగిన గురుని నేను చెప్పెదను. నీవాయన నాశ్రయింపుము. తరింతువని యిట్లనెను. ఈ దారిని రేపు నారద మహా మునీంద్రుడు వచ్చును. ఆయన భుజమున వీణ ధరించి ముసలి బ్రాహ్మణ రూపమున యీ దారిని పోవును. నీవాయన పాదములు పట్టుకొని మంత్రోపదేశ మందుమని యా శరీరమువిడచి దివ్య శరీరముదాల్చి యాజీవి వెడలిపోయెను. మరునాడు నారదమునీంద్రుని రాకకై యెదురుచూచు చుండ మీవలె విసవిస నడచిపోవు మహానీయుని పాదములంటి శ్రీరామతారక మహామంత్ర ముపదేశము చేయుడని కాళ్ళ వ్రేళ్ళ బడితిని. ఆయన నన్ను చూచి జాలిపడి యిట్లనెను.

ఓ వెర్రివాడా! నన్ను పట్టుకొన్న యేమి లాభము? నేను తారక మంత్రోపదేశము గావించుటకు తగిన వాడనుగాను. అందులో ప్రముఖుని వలన నీవుపదేశమందుము. నీవు తరించగలవు. నాథాక నీ శుభమునకు

చిహ్నము. నాడు వాల్మీకి దగ్గరకుపోయి రామమంత్రము చెప్పి రామాయణము వ్రాయునట్లు ప్రోత్సాహమిచ్చితిని. ఇప్పుడు నీకు నీ పుణ్యముకొలది నేనగుపించితిని. నీవు రెండవ వాల్మీకి వయ్యెదవు. రామకథా గ్రంథము గొప్పది. నీవలన వ్రాయబడును. అందులకై నీకు తగినశక్తి ప్రసాదించగల మహా మంత్రోపదేశకర్త యా బ్రాహ్మణుడని మిమ్ము చూపినాడు. నేను సందేహించి మీకన్న యా బ్రాహ్మణుడెంత గొప్పవాడన్నాను. అది విని యా బ్రాహ్మణుడు సామాన్యుడుగాడు మహా శక్తివంతుడు.

రామచంద్రుని సేవతో నిరంతరమునిల్చి మహాతారక మంత్రము దివారాత్రములు జపించుచుండు మహానుభావుడు మారు రూపముతోనున్న రామభక్తాగ్రేసరుడు హనుమంత ప్రభుడని యప్పుడు చెప్పినాడు గురుదేవా! నన్ను వదలక దయతో శ్రీరామప్రభు మంత్రముపదేశించి తరింపజేయుమని దీనముగా ప్రార్థించెను.

అదివిని వాయునందనుడు పండ్లుకొరికి "నీకు నన్నప్పగించినాడా? ఏడీ యా నారదుడు? నేను వాని శిరము పగులగొట్టెదనని గదాయుధముతో చతుర్బాహువులతో. సూర్యతేజముతో తులసీదాసుముందు నిలబడెను. ఇందులో రహస్యము తన భక్తునకు నిజరూప దర్శనము నిచ్చుట కపట కోపము ప్రదర్శించుటయు మారుతి చేసెను. దానికి తులసీదాసు భయపడి స్తుతులొనరించి నాతో మీ విషయముచెప్పి చితిపేర్చి యందులో దుమికెనన్నాడు. పకాలున స్వామి నవ్వి "చితిలో దూకినాడా? నారదుడు నావలన నీకు మంత్రోపదేశము చేయించదలచినాడు. అతని కోరిక నేను తీర్చెదను. నీవాంఛితము నెరవేర్చి నా భక్తునిగా, శిష్యునిగా చేసుకొందును. ఇప్పుడు

రాత్రి సమయము. ఈ సమయములో మంత్రోపదేశము రాక్షస జాతికి చెల్లినది.

నీయందు నాకు ప్రేమ గల్గినది నేను నీకు శ్రీరామ తారక మంత్రోపదేశము గావింతును. ఇప్పుడు వెనుకకు మళ్ళుము తేపటి రోజు దయము నాగురువుగారు సూర్యభగవానులు ఆయన యుదయించి బారెడు ప్రొద్దు యెక్కు సమయములో చక్కని సమత్వ కాంతులు చిమ్ము చుండును వేడివెల్గు బాగుగా బంగారు కిరణములు ప్రసరించు వేళ నేను నీయాశ్రమము నకు వచ్చెదను వచ్చి నీకు శ్రీరామ తారక మంత్రముపదేశింతును సిద్ధముగా నుండును నీవు సంశయింప పనిలేదు. నేనుమాట యిచ్చిన తిరుగను నిన్ను నావానిగా చేసికొందును నాప్రభువు శ్రీరామచంద్రుని చెప్పి నీకు దర్శన మిప్పింతును మీ భార్యాభర్తల నొకచోటునకు జేర్చెదను రామ సేవలో మున్గ జేసి తరింప జేయుదునని చేతిలో చేయివేసి యభయమిచ్చి యంతర్ధాన మందెను.

ఈ విధముగా తులసీదాసు శ్రీరామ భక్తుడగా నాంజనేయస్వామి శిష్యుడుగా మారెను గురువువద్ద శలవుగొని తన యాశ్రమమునకు త్సాహ ముతో బయలు దేరెను. ఆతనిలో నూతనమగు యుత్సాహము, బలము గురుదర్శ నానంతరము శరీరము మీద కన్పించ సాగెను.

ఆరాత్రి తులసీదాసునకు నిద్రలేదు తన హృదయములో పట్టరాని సంతోషము బయలు దేరినది దేవతలకు దొరుకని. నాగురుదేవుడు పూర్వ పుణ్యఫలముతో మంత్రోప దేశమున కంగీకరించి దయచూపినాడు. నన్ను వంటి ధన్యుడొకడుండడు. పరమ దేవతా స్వరూపుడు శంకర తేజోమూర్తి నాగురుదేవుడాంజనేయ ప్రభువు. శ్రీరామ చంద్రుని దివాణములోనికి

ప్రవేశించుటకు నాగురుదేవు ననుజ్ఞగావలయును. ఎవరూ మాస్వామిని వ్యతిరేకించ జాలరు. వ్యతిరేకించిన వాలుమును చుట్టి మహాసముద్రములో మూడు ముంపులు ముంచగలడు. లోకములు దద్దరిల్ల సంచరించగలడు నాప్రభుని చరిత్రము మహామహిమలతో గూడినది. అట్టివాడు నాగురుదేవుడు రేపు నా నివాసమునకు యెట్లువచ్చునో; విశ్వరూపముతో వచ్చునో. బ్రహ్మణ రూపముతో వచ్చునోయని యోచించ సాగెను.

అట్లారాత్రి గురుధ్యానముతో నుండి లేచి దంతధావనాదులు తీర్చు కొన్నాడు గంగానదిలో చక్కగా మంత్రపూరితముగా స్నానము చేసినాడు సంధ్యా వందనాదులు జపము సాగించినాడు. అంతకు పూర్వమే గంగానది జలములతో తన యాశ్రమము శుద్ధిపరచినాడు అక్కడ నున్న రెండు దుంగలు తెచ్చి యందుంచినాడు అంతకన్న పీఠము లెక్కడ దొరకును? ఇట్లు విశాలమగు దుంగముక్కలమీద తాను సంపాదించిన దర్భాసనము వేసి యుంచెను. గురుని రాకకై వేచి యుండెను తన గురుదేవుడెట్లు వచ్చునో యని యోచనలో నున్నాడు జాము ప్రొద్దుయెక్కుసరికి మెడలో రుద్రాక్ష తావళము విభూతిరేఖలతో నున్న మొగము పింజెలుతీర్చిన ధోవతి కట్టు. పెద్దంచులుగల వల్లెవాటుతో తలవంచి యాశ్రమములోని కడుగిడి యిట్లనెను.

తులసీ! యిటురా! తూర్పుమొగముగా గుర్చుండుము. ఆ చమనము చేయుము నేను సంకల్పము చెప్పెదనని గోత్ర నామములతో గురుదేవుని నామముతో సంకల్పము నడపి యంగన్యాస కరన్యాసములతో శ్రీరామ తారక మంత్రము కుడి చేవిలోనుపదేశించి పల్కించెను.

ఇట్లు తులసీదాసు మహానుభావుడగు హనుమంతస్వామి వలన శ్రీరామ తారకమంత్రోపదేశమంది గురువుగారి పాదములు పట్టుకొని

"గురువర్యా! తమ దయవలన మహా మంత్రము పొందినాను. ఈ మంత్రాధిష్ఠాన దేవతా శ్రీరామచంద్రప్రభు దర్శనము నాకిప్పించ గోరెదను. ఈ శిష్యుని వాంఛితముతీర్చ ప్రార్థించెదనని దీనముగా వేడుకొనెను ఆంజనేయ ప్రభువు "నీ" తులసీ! నీకు సీతాసమేత శ్రీరామచంద్ర దర్శనము చేయింతును. నీవు యీ తారక మహామంత్రములు చక్కగా కొన్ని కోట్లు పగలురాత్రులు శంకలేకుండా జపింపుము. నీవు సర్వశుద్ధజీవివైనావు. నేను సమయము చూచి మన ప్రభువర్యుని నీ యాశ్రమమునకు గొనివచ్చి దర్శనమిప్పింతును. ఆతరువాతనే నీభార్య కోరిక తీర్చిన వాడవై యంపెను నీ యాశ్రమమునకు పిలువ బంపును పిమ్మట మీరిద్దరు స్వామిసేవలో మున్గి సంతోష తరంగములలో తేలియాడ గలరు.

నీ భార్య వచ్చిన తరువాత "శ్రీరామ చరితమానస" మహా గ్రంథము రచింపుము. నారదుడు నీవు రామకథ వ్రాయుదువన్నాడు గదా! నీ వపర వాల్మీకివై పేరుపొందెదవు. భక్తిరసముబ్బి పోవునట్లు విచిత్ర కల్పనతో నీమాతృభాషలో వాల్మీకి గ్రంథమాధారముగా కథతో విశేషమగు రీతుల చూపించగలవు. నాశిష్యుడు ప్రభువరేణ్యుడగు రామ కథారచయితగా పేరొందిన యెంత సంతోషము. ప్రభువుతో నీవిషయము మనవి చేయుదునని చెప్పియిన్ని కోట్లు మంత్రపునశ్చరణతో మంత్రసిద్ధియని యంతవరకు వెదువక చేయుమని నిర్దేశించి పల్కెను. తులసీదాసు తన యోగమునకానంద పడసాగెను.

నీకు వీలయు వేళల యందు నన్ను స్మరింపుము నీ కనుమానము, భయము లేకుండా వాగ్బలము ప్రసాదించెదను. ఈమహామంత్రరాజమునిన్ను యిహ పరానందములలో నుంచునని చెప్పెను తరువాత శిష్యుని వెన్నుదట్టి శిరస్సుపై నభయ హస్తముంచి మారుతి యంతర్ధాన మయ్యెను.

# తులసీదాసునకు శ్రీరామ దర్శనము

గురువుగారు చెప్పినట్లు తారాక మంత్ర మహోరాత్రములు జపము చేయసాగిన తులసీదాసు క్రమముగా యోగనిష్టలో నుండసాగెను. అందుమహాతేజమును దర్శించుచు పరమానందముగా కాలము జరుపు కొను చుండెను తన పర్ణశాల గంగా స్నానము, యోగనిష్ట, బ్రహ్మతేజో దర్శనము యిందులోనే దినములు సూర్యోదయ మాదిగా శుభప్రదములుగా గడప సాగెను తన గురువర్యుని యానతి ననుసరించి జపము కోట్లాదిగా చేయుచుండెను. ఆతడు చేయుచున్న జపమునకు గురువుగారు చెప్పిన పరిమితి సమీపించిన కొలది నుత్సాహము, తేజముగల్గి ప్రకాశించుచుండెను. తన శిష్యుడు యింత వాడగుచున్నాడని పరమానందముతో హనుమంతస్వామి పరోక్షముగా తిలకించుచుండెను. ఆతడు నియమిత సంఖ్యలో జపము పూర్తిచేయుట గమనించి ప్రభుని దర్శనము చేయించ నిశ్చయించుకొని తులసీదాను ముందు నిలబడెను.

ఆతడు జపనిష్ఠబూని యోగిగా నుండి యెవరిని చూడని స్థితి గల్గుట కానందమంది యొక్కసారి శిరముపై తనచేతి నుంచి తాకెను. అంతవరకు యోగధ్యానములో జపము గావించుచున్న శిష్యమూర్తికి శరీర విషయము తెలిసి కన్నుదెరచి చూచెను. ఎదుట ధగధగాయమానాముగా వెల్గుతు చిరునవ్వులు చిమ్ముముఖముతో రామనామ గానము గావించు కంఠధ్వనితో నిలువెత్తు శరీరధారియగు గురుని నిజరూపము గన్పించెను వెంటనే లేచి నిలబడి గురుని పాదాలకు స్సాష్టాంగాపడెను, తన శిష్యునియందు పరిమితాను రాగముతో సంతోషించి యిట్లనెను.

తులసీ! నిన్ను, నీ భార్యను యిద్దరనొక చోటునకు చేర్చెదను. ఆమెకూడ మహానిష్టతో జీవితము సాగించుచున్నది. ఇప్పుడు నీ జపపర్యవసాన ఫలితము పొందగలవు. నీ భార్య కోరినట్లు ప్రభుని దర్శనానంతరమామెను కలుసుకొని యిద్దరు సుఖముగా యోగ జీవితము గడుపుడు. రేపే ప్రభువును ప్రార్థించి గొనివచ్చి చూపింతు ననెను. దానికాతడానందపడి "గురువర్యా! నీవు తలచిన సాధ్యముకాని పనియున్నది. నూరు యోజనము లున్న సముద్రముదాటి శత్రువులకు ప్రవేశింప శక్యముగాని లంకలో సీతాదేవిని చూచి శుభ వృత్తాంతము సముద్రము మరలదాటి రామునికందించిన మేటివి. మమ్ములను కలుపుటన్న నీకెంత? నీ దయయే నాకు కావలసిన" దన్నాడు. గొప్ప హృదయముగల తన శిష్యునిదలంచి వానరస్వామి మురిసిపోవుచుండెను. రేపు ప్రభువునకేమి చేయుదువో, మాతల్లి సీతా సమేతముగా నీకు దర్శనము కాగలదని చెప్పి వెళ్ళిపోయెను. శ్రీరామచంద్రమూర్తి సన్నిధికి మారుతిపోయి తన శిష్యునకు తల్లి సీతాదేవితో దర్శనమిమ్మని కోరెను. అదివిని రామచంద్ర ప్రభువంగీకరించెను. తులసీదాసు రామచంద్ర స్వామి దర్శనభాగ్యము కల్గుచున్నదని తగు యత్నములో నుండెను.

చుట్టుప్రక్కల ఫలవృక్షముల వద్దకుపోయి యారమగ్గిన పండ్లు తెచ్చి ప్రోగుపెట్టెను. తన ప్రదేశమంతయు గంగాజలముతో పరిశుభ్రముగా శుద్ధిచేయ జల్లెను. పూవుల మాలలు తోరణములు గట్టెను. పూవులుతెచ్చి పరచుటకు యత్నము గావించెను. సుగంధ పుష్పములు, తులసిదళములు, బిల్వదళములు జాగ్రత్త పరచెను. ఇంతకన్న యెక్కువ యేమున్నది? చదరముగల నొక దుంగను తూర్పు ముఖముగా నుంచెను. దంపతుల సర్పించు

టకు సర్వసిద్ధముగా తులసీదాసుండెను. ఆ రాత్రియంతయు స్వామి ధోర ణియే! కోడికూత వేళకులేచి గంగానదీ స్నానము గావించి నిష్టబూని తారక జపము చేయుచు శుభతోరణాలంకృతముగా పర్ణశాలను గావించెను.

వారుండు చోటగల చదరపు దుంగనుమీద దర్భాసనమువైచి పూవులు, దళములు చల్లియుంచెను. తన గురుదేవునకొక చోటు నిర్ణయించి యుంచెను. దానిమీదకూడ దళములు, పూవులుపరచి యుంచినాడు. తరువాత వారిరాకకై యెదురు చూడసాగెను. ఇంతలో పర్ణశాలలో తీక్షణములేని యొక వెలుగు తళుక్కున మెరసెను. దానిని చూచి తులసీ యదరుపడెను.

ఇంతలో తులసీదాసు యెదుట సీతారాములు, హనుమంతుడు నిల బడిరి. ఆ మహాభక్తుడు వారిని చూచి పాదాభివందనము చేసి తాను పరచిన పూవులుగల స్థానములో నిలబడి యుండిరి. వారి పాదములు గంగాజలముతో ప్రక్షాళనము గావించి యాపాదజలము తన శిరస్సున ధరించెను. రామచంద్ర స్వామిని సీతాసమేతుని చూచి పాదములు పట్టుకొని విడువకుండెను. శ్రీ రాముడు తులసీదాసునకు నభయహస్తమిచ్చి వీపుతట్టెను. అతనికి లోపల నుండి రామహస్తము తగులుటతో గొప్ప వాగ్బలము వచ్చినది. శ్రీరామ ప్రభునిట్లు స్తోత్రము గావించెను. సీతారామచంద్రా! ఎన్నెన్ని జన్మల పుణ్యఫలమో నేటికి స్వరూపమంది నీ దర్శనభాగ్యము కల్గజేసినది మహా ప్రభూ! నిన్ను యెవరు దర్శింపగలరు. నా గురుదేవుని దయతప్ప మరొకటి కాదు. నీవు పంచభూతములతో నిండిన యీ లోకముల కావల నిలబడి నీ తేజముచే సమస్తము చూచుచున్నావు.

నీవు లేనిచోటు లేదు. నిన్ను మించిన దేవుడు లేదు. నిన్నాశ్ర యించిన వాడే ఘనుడు. నీ దయగల్గిన జీవి యిహపరములం దానందముగా

నుండగలను. నేను రక్తమాంస పూరిత దేహధారినగు మానవుడు. నిన్నెవ డెఱుగును. నీ దయగల్గిన కొంచెము తెలివి వచ్చి నిన్ను దర్శింపగలడు. ఇతరులు సంసారములో మునిగి దారి తెలియక భార్యా పుత్రాదులు స్థిరమను కొని జీవితకాలము వ్యర్థము చేసికొని శరీరములు విడుతురు. మరల కర్మ ఫలముచే యేవో నీచ జన్మలెత్తుచు బండిచక్రమువలె తిరుగుచు తుది మొదలు లేనట్లు జనన మరణములను ప్రవాహముతో బడిపోవుదురు. నా పుణ్యముకొలది యా మార్గము తప్పించి యీ త్రోవలో నిలబెట్టినావు. నిన్ను నా గురుమూర్తి దయతో దర్శించితిని నా కోరిక తీరిన దన్నాడు.

రామచంద్రమూర్తి సీతా సమేతుడయి యుండి యిట్లన్నాడు కోటి మంది కొకడు నన్ను గుర్తించును. అటువంటి వాడవు నీవు. నీకు శాశ్వత ముక్తి గల్పించెదను. అంతవరకు నీ భార్యను పిలిపించి నీతో నుంచు కొనుము. మీ రిద్దరు నన్ను యీ శరీరములు వదలిన తరువాత జేరగలరు. నా దివ్య చరిత్రము నీ భక్తికొలది రచింపుము. నీకు శాశ్వత కీర్తి లభించును నా భక్తుడగు.

## తులసీదాసు దంపతులు - రామచరిత మానస

ఈ హనుమంతుని సాయము నీకెల్లప్పు డుండగలదని దీవించి శ్రీరామప్రభుడు హనుమత్సీతా సమేతముగా మాయమయ్యెను. తులసీదాసు తన జన్మకు సాఫల్యము గలిగించిన యిల్లాలి మాట తలపునకు వచ్చినది. నన్ను యెంత చక్కని దారిలో పెట్టినది. అది భార్యకాదు నాకు ముక్తి

దారి తెన్నులు లేకుండా బ్రతుకవలసి వచ్చును. ఇదేమి చిత్రము? భార్య ప్రోద్బలమా! గంగాతీరమున నివాసమా? రామనామ జపమా? బ్రహ్మ రాక్షసుని దర్శనమా? నారద మునీంద్ర సందర్శనమా? పరమానంద యోగ దాయకమా? ఆ మహానుభావుని మంత్రోపదేశమునకు కోరుటా? ఇవి యన్నియు మానవునకు కలగవలసినవేనా? ఇది యొక పవిత్ర విచిత్ర సంబంధ యోగము.

ఆయన నన్ను మంత్రోపదేశము చేయక మెలిత్రిప్పినట్లు మార్చినాడా? తారకమంత్ర మాయన యుపదేశింపలేడా? నాకు మహాను భావుని శిష్యరికము శ్రీరామ ప్రభు దర్శన మగునని త్రికాలవేది నారద మునీంద్రు డెరిగియే యింత చేసినాడు. రామాయణ కాలక్షేప ప్రదేశమా! గంగాతీరమా? బ్రాహ్మణ గృహమా! అంత పవిత్రయున్న గురుదేవుని గుర్తులన్నియు చెప్పి మప్పినాడు జరుగదగిన దానిని నిర్ణయించినాడు నాకు నా గురుదేవుని ప్రచ్ఛన్న రూపుని వివరించి చూపినాడు. ఎవరికీ లొంగని నా గురువు నన్ను హుంకరించి. యదలించి. బెదరించి. పరీక్షించి తనకు శిష్యునిగా నంగీకరించినాడు.

తన ప్రేమ యంతయు చూపి స్వయముగా వచ్చి తారక మహా మంత్ర ముపదేశించినాడు. నా కోరికను మన్నించి శ్రీరామచంద్రుని మంత్రా ధిష్ఠాన దేవతను స్వయముగా మంత్రసిద్ధియైన వెంటనే దర్శనమిప్పించి నా భార్య వాంఛితము తీర్చినాడు. ఆహా! నా జన్మకాల మహిమగాని యొండు కాదనుకొనెను.

మహా తీవ్ర ప్రతిజ్ఞ నా చేత చేయించి తాను తీవ్రతరమగు దీక్షలో నుండి యింతకాలము రామనామము జపించుచు నిలచిన యిల్లాలిని

వెంటనే చూచెదను. ఆమెకు శుభవార్త చెవిలో వేయుదును. మే మిద్దరము యీ పవిత్ర ప్రదేశములో యోగమార్గము నవలంబించి శ్రీరామసేవ చేసి కొందుము. నిజముగా భార్య కాదు బ్రహ్మజ్ఞాన బోధి నీ దివ్యశక్తి. నే నా శక్తి బలముతో గదా శ్రీరామప్రభు దర్శనము గావించినది. అందుచే నేను నా భార్యా రూపమున నున్న మంగళదేవతను దర్శింతునని బయలుదేరెను. ఆతడు తన భార్యయున్న యత్తవారి గ్రామము ప్రవేశించెను.

తులసీదాసును చిరకాలము క్రితము యెప్పుడో చూచినారు. ఇప్పుడు గడ్డము, యోగ వేషముతోనున్న నాతనిని చూచి యెవడో సాధువు భిక్షాటనమునకై వచ్చినాడనుకొన్నారు. తిన్నగా నత్తవారింటికి పోయినాడు. సాధువు లోనికి ప్రవేశించుచున్నాడని తిరగబడి చూచుచున్నారు.

ఆతడు ముందుగదిలో శ్రీరామసేవ చేయుచు యోగినీ రూపములో నున్న యిల్లాలిని కనిపెట్టి గుమ్మము ముందు కూర్చుండెను. ఆమె తన పూజానంతరము తలయెత్తి చూచెను. తన భర్తకున్న పుట్టుమచ్చ కంఠము మీద దానిని చూచి సంతోషముతో లేచి నిలబడి నమస్కరించినది. ఆతడామె చేతులు పట్టుకొని "నీవు పెట్టు నమస్కారమున కర్హుడనుగాను. నీవే నా యధిష్ఠాన దేవతవు. ఇంత భీషణమగు వ్రతముతో నుండిన నీ హృదయశక్తికి నేను చేతులు జోడించెదను. నీ చలువ వలన శ్రీరామచంద్ర దేవుని దర్శనము గావించితిని. నన్ను నీవానాడు శాపించిన ప్రకారము శ్రీరామప్రభు దర్శనము పొందినాను.

ఆ సంతోషముతో నిన్నుచూచి నా వెంటబెట్టుకొని నా యాశ్రమములో నుంచుకొని దివ్య దీక్షతో మనమిద్దరము రామసేవ చేయుచు జీవ యాత్ర సాగించా దలచినాను. నాతోడరమ్ము. నీకోర్కె తీరినది. నా కోరిక

తీర్చుము నా చరిత్రము చాలా చిత్రముగా మలచబడ్డది. నాకు శ్రీరామ దర్శనము కాకుండా నిన్నుచూడ రాలేదనెను."

అదివిని యా యమ్మ పరమానంద మందినది. తనలోనిట్లు భావించినది. ఇప్పుడుగదా మా దాంపత్యములోని నిర్మల సుఖము. నా భర్త మహా యోగమునంది దేవతల కందరాని శ్రీనివాసుని దర్శించిన పుణ్యాత్ముడుగా మారుట కాశ్చర్యము కాదా? సామాన్య మానవుడు యోగనిష్ఠ. ప్రభుదర్శన యోగము యెట్లు జరిగినది. ఇది నమ్మదగిన విషయమా? కాదా? నేనన్నాను గాని యది జరుగునా? ఏమో నాకాశ్చర్యముగా నున్నది. నాపతి యబద్ధ మాడడు. ఇంత నిత్యానంద మూర్తిగా నుండడు. ఎట్లు జరిగినదో విని యానందించెదను యని యాలోచించి యిట్లనెను. మీకు శ్రీరామప్రభు దర్శనము జరిగిన విధానము నేను వినదగునా? వారేమి శలవిచ్చినారు? నాకు ముచ్చటగా, హృదయ మానందమందునట్లు వివరింపుడని సాదరముగా బల్కెను. దానికి తులసీదాసు మొగమున గొప్ప సంతోష కాంతులు వెలికి జిమ్మ నిట్లనెను.

నీ కోరెక ననుసరించి నేను గంగాతీరముజేరి యొక యాకుటిల్లు చిన్నది కట్టుకొని యందే యుండి గంగానదీ స్నానము రామనామ జపము చేయుచు కొంతకాలము జరిపితిని. చాలకాలము జరుగగా నొకనాడు యా యాశ్రమ ప్రాంతమందున్న రావిచెట్టునుండి యొక వికృతాకారముగల జీవి వచ్చి నమస్కరించి యిట్లనెను. మహాత్మా! నీజప తీర్థముతో నా దోషము పోయినది. తాపము తగ్గినది. నేను కొంతసేపటికి దివ్య విమానములో యీ శరీరము విడచి దివ్యరూపముతో పోదును. నీ జపమునకు గురూపదేశ మంత్రము తారకము గావలయును. నారద మునీంద్రుడు రేపు వచ్చును. నీవా

శ్రయింపుమని ప్రోత్సాహించి వెడలిపోయెను. నేనా నారదమునీంద్రు నాశ్ర యించి మంత్రోపదేశము చేయమని ప్రార్థించితిని.

ఆయన నన్నుచూచి నీకుతగిన గురుని చూపెదను. ఒక ముసలి బ్రాహ్మణుడు రామాయణ శ్రోత యీ దారిని పోవును. పట్టుకొని యాశ్ర యించి యెంత మొరాయించిన వదలకుము. తారక మంత్రముపదేశించుమని చెప్పి నారదముని వెళ్ళిపోయినాడు. ఆయన మాటప్రకార మా వృద్ధబ్రాహ్మ ణుని విడువ పట్టుకొంటిని. దయతో తారక మంత్రముపదేశించెను.

ఆయన యెవరనుకొన్నావు నూరు యోజనముల సముద్రముఁదాటి సీతాదేవిని దర్శించి లంకాదహనము గావించి శ్రీరామునకు సీతా చూడామణి నందించిన వాయుమహాదేవుని పుత్రుడు నా గురుదేవుడాంజనేయ స్వామిగా నెరుగుమన్నాడు. ఆమె గ్రుడ్లు వెళ్ళబెట్టినది. ఎంతపని జరిగినది? అహా! నా భర్త దేవతాకోటి కందరాని మహా వేల్పులను దర్శించుటా? తారకమంత్ర ముపదేశమందుటా? యెంత మహాఫలమనుకొని హద్దులులేని సంతోషముతో నుండి యిది యిట్లయిన శ్రీరామచంద్ర స్వామిదర్శన మెట్లబ్బినదని యడిగి నది. నాకు మంత్రోపదేశము చేసిన తరువాత నాకు యీ మంత్రాధిష్టాన దేవత రామప్రభుని దర్శనము చేయించుము. ఇది నా భార్య శాసనమన్నాను. దానికి నా గురుదేవుడానందించి "యీ నా యుపదేశించిన తారక మంత్రము యిన్నికోట్లు జపింపుము. మంత్రసిద్ధియైన వెంటనే నా ప్రభుని నీయందను రాగము సీతాసమేతముగా గొనివచ్చి దర్శన మిప్పించెద"నని వెళ్ళిపోయెను.

నేను దీక్షతో పగలు రాత్రులు విడువకుండా యన్నికోట్లు మహా మంత్రము యోగనిష్ఠ ద్వారా జపించితిని. నా గురుదేవుడు ముఁదువచ్చి "నీకు మంత్రసిద్ధి యైనది. శేష రామచంద్ర స్వామిని సీతా సమేతునిగా

గొనివచ్చి చూపించెదనని చెప్పి వెళ్ళిపోయెను. మరునాడు నాపాలివేల్పులు సీతారాములు గురుదేవును నా యాశ్రమమునకు మెఱుపు మెఱసినట్లు తళుక్కుమనెను. వారువచ్చి నా యాశ్రమములో నిల్చి దర్శనమిచ్చి వరదానము చేసెను, నిన్ను గొనివచ్చి యీ యాశ్రమములో నుండజేయమన్నాడు. నన్ను రామకథాగానము గ్రంథరూపముగా రెండవ వాల్మీకివై రచింపుము. నీకు శాశ్వత లోకవాస మిత్తునని మాయమయ్యెను.

ఇట్లు తన వృత్తాంతము పూసగ్రుచ్చినట్లు భార్యతో చెప్పి తన వెంట నాశ్రమమునకు రమ్మని చెప్పెను. ఆమె పరమానందముతో యీ గాథవిని భర్త పాదములకు నమస్కరించి దీవించమని ప్రార్థించినది. అతడు తనకుడిచేతి నామె శిరమునబెట్టి "శ్రీరామచంద్ర ప్రసాద సిద్ధిరస్తు" యన్నాడు. భార్యా భర్తలిద్దరు గంగాతీరమున నున్న యాశ్రమమునకు ప్రయాణమైరి. ఈ విషయము గ్రామములో ప్రాకినది. వారి పుణ్యమునకు మెచ్చుకున్నారు. వారివెంట కొంతమంది విరాగులు బయలుదేరినారు. తాము కూడ తరించ నెంచినారు. వారందరాశ్రమమును పెద్దదిగాచేసి యెండలు వానలు మీద పడకుండా చక్కగా తయారుచేసిరి. ఆ యాశ్రమములో నొక పూజామందిరము, శయనస్థలము, భజనపరులకు, నుపన్యాసకులకు విశాల మండపము యివి యన్నియు నందే యేర్పచిరి. వారు శ్రీరామ పూజాదీక్షలో కొనసాగుచు వానప్రస్థ జీవితములు సాగించసాగిరి. క్రమముగా తులసీదాసు మహిమ కాశీ నగరమంతయు వ్యాపించినది. అప్పటినుండి జనము తండోపతండములుగా రాసాగిరి. శ్రీరామనామ సంకీర్తనముతో మారుమ్రోగునట్లు సంచరించసాగిరి.

తులసీదాసునకు గురుదేవుని దర్శన పవిత్ర స్థలమున యీ విగ్రహముంచి మొదట పూజింప తలపు గల్గెను. వెంటనే శ్రీరామ భక్తాగ్రేసరు

డగు వాయునందనుని విగ్రహముంచి యర్చించసాగెను. ఆయన యట్లు విశేష ఖ్యాతి పొందసాగెను. ప్రజలలో మెలకువ వచ్చినది. ఇది యిట్లు సాగుచుండగా సరస్వతీ ప్రసాదము లభించినది. ఇది వరుతో నారదమునీంద్రుడు. గురుదేవుడు శ్రీరామ ప్రభువు ముగ్గురు దీవించి యనుగ్రహించి వరమిచ్చిన కవితా ప్రవాహము వెలికి రాసాగెను. అక్కడనుండి శ్రీరామ రామాయణము తనభక్తికి తగిలిన పోకడలతో వ్రాయుటకు ప్రారంభించెను. విద్యాధికులు. భక్తులు. విద్యాసక్తులు తులసీదాను వ్రాయుచున్న రామకథా ఘట్టములు వినసాగిరి.

ప్రతిదినము రచించిన భాగములు పురాణముగా గానము చేయుటతో విద్యాధికు లాయన కవితా ప్రవాహము మానస సరోవరమువలె రామచరిత్ర ద్వారా వెలికి వచ్చుచున్న దనుకొన సాగిరి. దానితో మహాభక్తుడు తులసీదాసు "శ్రీరామ చరిత మానస" యని తన గ్రంథమునకు నామకరణము గావించెను.

## తులసీదాస్ - గురుభక్తి

గోస్వామి తులసీదాసు మహా మహాుడుగా భక్తిపరుడుగా జన్మము తరించునట్లు జీవయాత్ర నడుపుటకు మూలకారణము తన గురుదేవుడగు శ్రీ ఆంజనేయస్వామి గదా! తన గురుభక్తి ప్రకటించుటకు నిత్య సంకీర్తనము గావించుటకు భక్తి ప్రధానముగా సర్వదోషములు హరించునదియు. భూత ప్రేత పిశాచాదుల బాధలు పోవుటకు శ్రీరామచంద్రి కటాక్షమందుటకు సర్వలాభములు సర్వ కార్య జయము సంపాదించుటకు మహా మంత్ర యుక్తమగు స్తవమును నలుబది గీతములు (ఛందో బద్ధమగునవి)

హనుమాన్ చాలీసా యను నామముంచి రచించెను. నాటినుండి నేటివరకు సమస్త ప్రజానీకము దానిని ప్రతిదినముగాని పర్వములందుగాని, బాధలలో నున్నప్పుడుగాని, కార్యర్థనాదులు వలయునప్పుడుగాని భక్తితో హనుమంతు నారాధించుచు పారాయణము చేయుచుందురు. అట్లు చేసినవారలు తమ తమ కార్యసిద్ధు లందుదురు.

తన గురుదేవుని ప్రభావముతో గత మహాగ్రంథము "శ్రీరామ చరిత మానస" యను నామకరణముచేసి రచించినాడు. గురుదేవు డనుగ్ర హించి యుపదేశము గావించిన తారకమంత్ర ప్రభావముతో తన జన్మ తరించినది. తన్ను యింతవానిగా చేసిన గురుదేవుని విగ్రహము యిప్పటికి కాశీక్షేత్రమున కనతి దూరములో నుండజేసి జీవితాంత మర్చించుచుండు వాడు. ఇప్పటికి కాశీక్షేత్ర దర్శనము గావించువారు తులసిదాసు విషయము యెగిరినవారు తులసీదాసుకు దర్శన మిచ్చిన మహా బలశాలిని దర్శింపక మానరు తులసీదాసు గురువరేణ్యుని దర్శనము పాప హరము.

పెక్కుమంది దర్శించి పూజించి తమ భక్తి ప్రపత్తులు చూపించె దరు. అట్టి మహా గ్రంథకర్త తన గురుదేవుని స్తుతము గావించిన విధాన మందరు చదువుచు భక్తితో తన్మయు లగుచుందురు. కార్యసిద్ధికి నలుబది దినములు దినమునకు నలుబది సార్లు పఠించుదురు.

## గురు గుణ స్తవము

రామ పూజారి! పర వుపకారి

మహావీర! బజరంగబలీ!

సద్ధర్మచారి! సద్బ్రహ్మచారీ
జ్ఞాన గుణసాగర! రూపవు జాగర్త!
శంకర సువన! సంకట మోచన!
కేసరి నందన! కలిమల భంజన!

రాఘవదూతా! జయ హనుమంత!
అంజని నందన! అసురని కందన!

మంగళమూరితి! మారుతి నందన
జయ రణధీరా! జయరణఘోర
జయ బలభీమా! జయ బలరామా॥

భావము: ఓ గురుదేవా! ఆంజనేయస్వామీ! నీవు రామపూజా కార్యములో నిరంతరము నిల్చిన ఘనుడవు. పరోపకారము నీ సొమ్ము. నిన్నాశ్రయించిన వారు మహా లాభమునందు నట్లు చేయు స్వభావమువాడవు మహా వీరుడవు. రంగమందు మహాబలమును ప్రదర్శించు శూరుడవు. ధర్మమును తప్పకుండా నడచుచు మహా విద్యలు వేదశాస్త్రములు సంపాదించిన వాడవు, బ్రహ్మము నాశ్రయించుటకు మనస్సును నిల్పి దీక్షతో పరబ్రహ్మమును దర్శించుచుండు చిరంజీవివి. జ్ఞానముపొందిన వాడవై సద్గుణముల జలమునకు సముద్రము స్థానమైనట్లు స్థానమైన వాడవు. జాగ్రత్తతో నున్న రూపము వాడవు.

శివ ప్రదమగువాడా! సమస్త దుఃఖములు నశింపుచేయువాడా! కేసరీ కుమారా! నిన్ను స్మరించ గాకలిదోషములు హరించువాడా! రామా దూతా! గురుదేవా! హనుమంతా! నీకు జయము! అంజనీపుత్రా! రాక్షస సంహారా! యుద్ధరంగములో చలించని ధైర్యముగల స్వామీ! యుద్ధము

నందు గొప్ప నాదము చేయువాడా! శత్రుభయంకరుడా! భీమ బలము గల వాడా! రామ బలమందిన దేవా! జయము, జయము.

# శ్రీ తులసీదాసకృత హనుమాన్మహిమాను వర్ణనము

మంజు మంగళ మోదమయ
మూరితి! మారుతి! పూత!
సకలసిద్ధికర కమలతల!
సుమిదిత రఘువర దూత!

భావము: గురుస్వామీ! నీవు మృదువుగా నుండు మంగళ స్వరూపుడవు! సంతోషము మయమగు నాత్మతో నిండిన వాడవు. అట్టి దివ్య మూర్తివికదా! మారుతీ! పవిత్ర చరిత్రగల ధీరా! నీ చేతిలో సకలసిద్ధులు గల్గియున్న సర్వలాభ మూర్తివి. వినయ వివేకములు గల్గి రఘువంశ స్వామికి నిత్యము దూత కృత్యము నడుపువాడవు. నమస్కారము.

ధీర వీర రఘువీరప్రియ
తిమిరి సమీరకుమార్!
అగమ సుగమ సబకాబుకరు
కరతల సిద్ధివిచార్!

భావము: మహాధీరుడు ప్రతాపవంతుడు నగు రఘువంశ నాధునకు ప్రియాతి ప్రియమైన వాడవు హే వాయునందనా! చీకట్లను అజ్ఞానము వాయువు విసిరినట్లు దూరముగా తరుమగు శక్తివంతుడవు వేద వేదాంగ

ములు సులభముగా నేర్చినవాడవు. సమస్తములు దుర్లభముగా నున్న సమయములో వాటిని సులభముగా జరిపించ శక్తివంతుడవు. కరము నందున్న యుసరిక కాయవలే తృప్తిపరచువాడవు.

సుఖమున మంగళమున సుగుణ
సరోరుహ భాను!
కరహాకాజసబ సిద్ధి
అవిహియే హనుమాన్!

భావము: సుఖమునకు సంతోషమునకు సంపదలకు కలువలకు చంద్రునివలెను. కమలములకు సూర్యునివలెనో వికసింపజేయువాడవు నీవు హృదయములో ప్రవేశించినంత మాత్రముననే సర్వకార్యసిద్ధులు సమకూర్చు మహామహా! నీకు నమస్కారము.

సకలరాజ శుభ సమపు ఫల
సగుణ సుమంగళజాను!
కీరితి విజయ విభూతి ఫలి
హీంయ హనుమానహిం అను॥

భావము :

నా గురుదేవుని మహిమ లనంతములు ఒక్కసారి మెరుపువలే నా గురుదేవుడు హృదయములో ప్రవేశించిన వారికి సమస్త కార్యములు శుభములు జరుగుటలో సందేహములేదు సమస్త జనుల కార్యములు ఫలమునొసంగునవి యగును. శుభ శకునములు నిత్యము కన్పించును హనుమంతుని దలచినవారికి కీర్తి వృద్ధియగును. సర్వకార్యములందు జయము గలుగును. ఐశ్వర్యము సమృద్ధిగా వారికి చేరగలదు.

శూర శిరోమణి సాహసమతి
సమీర కుమార్
సురమితసభ సుభ సంపదా
ముదమంగళావతార్॥

భావము :

నా గురుస్వామి శూరులలో ప్రముఖుడు అనగా తంతటివాడు లేడు. సాహస మాయన సొమ్ము. ఎట్టి సంకట పరిస్థితుల నయిన నెదుర్కొని విజయము సాధించగల చొరవగల మహామనీషి. సమస్త దేవతా సభలయందు నా గురుదేవుని స్మరించువారై యుందురు. మంగళప్రదు డగువాడు సంపదల నిచ్చువాడు. ఆ యవతారమూర్తిని ధ్యానించినవారికి సమస్త మంగళములు తప్పక సిద్ధించును. ఆయన సంపన్న ప్రదాతయగు నీశ్వర స్వరూపుడుగాని సామాన్యుడు గాడు. అట్టి గురుదేవుని పాదపద్మములనే నాశ్రయించెదను. నా కాశీర్వాదము లిచ్చి యోగ సంపదలు ప్రసాదించి నన్నుద్ధరించగల మహాప్రభుని సేవ జన్మ జన్మలకు నాకు లభించుగాక! నన్ను చేరవలసిన గమ్యస్థానము నా గురుదేవుడు జేర్చుగాక! నా నమస్కారములు.

## శ్రీ హనుమాన్ చాలీసా పారాయణ ఫలము

హనుమాన్ చాలీసా పారాయణము వలన వచ్చు ఫలితము పెద్దలు మహనీయులు యిట్లు వివరించినారు. శ్రీమద్రామాయణములో నారు కాండెము లున్నవి. అందులో ముఖ్యము నెన్నదగినది సుందరకాండము. సుందర శబ్దమునకు అందమనియు, వానరుడనియు విచిత్రమగు రీతిగా

దలంచి వాల్మీకి సుందరకాండము మంత్ర శాస్త్ర యుక్తముగా బీజాక్షరములు కల్పించి కథను వ్రాసినాడు. అందలి కథా విధానమంతయు నీశ్వరాంశ సంభూతుడగు హనుమంతుని ప్రతాప పరాక్రమములు చాటుచున్నవి బైటకు మాత్రము హనుమంతుని విషయమైనను సుందరకాండ పారాయణము కొన్ని కొన్ని విధముల విధానములతో చేయువారి కాపదలు ప్రయోగములు భూత ప్రేత పిశాచ బాధ శత్రు పీడలు. దారిద్ర్య బాధలు తొలగిపోవుట సత్య సమ్మతము.

అనాదినుండి సుందరకాండ పారాయణము నిత్య సంధ్యాది కృత్య ములవలె నిష్కామ్యముగా పెద్దలు చేయుచు నిరామయులై దీర్ఘాయముతో తేజస్సుగలిగి జీవించుట లోకవిది. తమగు విషయము కఠినదీక్షతో కార్య సాధనము గావించుకొనుటకు సప్త సర్గ పారాయణ మొక ముఖ్య విషయము అట్టి మహామహిమగల హనుమత్పరాక్రమ వర్ణనలతో నున్న సుందరకాండ పారాయణముచేసిన ఫలితముతో సమానమగు ఫలిత మీయగలది "హను మాన్ చాలీసా" పఠనము.

ఈ గ్రంధము పఠించువారు బాధలనుండి విముక్తి పొంద దలచు వారు వాంఛితములు తీరునట్లు కోరువారు దీనిని రోజునకు 108 పర్యాయము లతో నలుబది రోజులు చేసిన దీక్షాపరులకు జరుగని కార్యముండదు. తా నున్న తావు వదలకుండా 108 సార్లు పఠించుట ప్రశస్తము త్రికాలము రోజు లలో పఠించిన వారికి యోగక్షేమములు సదా నా గురుదేవుడు చూచి బ్రోచు నని తులసీదాసు వర్ణించి రచించెను.

# ప్రార్థనా శ్లోకములు

శ్లో॥ మనోజవమ్ మారుత తుల్య వేగమ్
జితేంద్రియమ్ బుద్ధిమతాం వరిష్ఠమ్
వాతాత్మజం వానరయూధముఖ్యమ్
శ్రీరామ దూతమ్ శిరసానమామి॥

శ్లో॥ ఆంజనేయమతి పాటలాననమ్
కాంచనాద్రి కమనీయ విగ్రహమ్
పారిజాత తరుమూలవాసినమ్
భావయామి పవమాన నందనమ్॥

శ్లో॥ యత్ర యత్ర రఘునాథ కీర్తనమ్
తత్ర తత్ర కృతమస్త కాంజలిమ్
బాష్పవారి పరిపూర్ణ లోచనమ్
మారుతిమ్ నమత రాక్షసాంతకమ్

శ్లో॥ అతులితబలధామం
స్వర్ణశైలాభ దేహం
దనుజవన కృశానుం
జ్ఞానినామగ్రగణ్యమ్
సకలగుణ నిదానం
వానరాణా మధీశమ్
రఘుపతి ప్రియ భక్తమ్
వాతజాతమ్ నమామి॥

శ్లో॥ గోష్పదీకృత వారాశిం
మశకీకృత రాక్షసం
రామాయణ మహామాలా
రత్నం వందేః నిలాత్మజం॥

# హనుమాన్ చాలీసా ప్రారంభము

శ్రీ గురుచరణ సరోజరజ
నిజమనముకురసుధారీ !
వరణౌరఘువర విమలయశ
జోదాయకు ఫలచారీ
బుద్ధిహీనతనుజానికై
సుమిరౌంపవనకుమార్॥
బలబుద్ధివిద్యాదేహుమొహి
హర హుంక వేశవికార్॥

భావము:—

నా త్రిలోక పూజ్యుడగు గురుదేవుని పాదపద్మములా శ్రయించి యామహానుభావుని పాద సంబంధమగు దుళించే నా మనస్సుయను యుద్ద మును నిర్మలముగా నుండునట్లు చేయుటకునై యారజమును పుచ్చుకొని రుద్ది నాలోని కల్మషమును పోవుటకు నిత్యము ప్రయత్నించెదను. దానితో నా దోషములు నశించిపోవును గదా!

ఆ పిమ్మట నా జీవితమునకు వలసిన పురుషార్ధములు పుట్టినది మొదలు చివర వరకు పొందదగిన ఫలితములు అనగా ధర్మముతో నడుచుట

మనస్సు నందుకోరుకొని న్యాయ సమ్మతమగు కోరికలు లేవనెత్తుట వాటిని పొందియందుండు లాభములనను భవించుట. చివరకు జీవికి వలసిన ముక్తిని పొందుట యివియన్నియు ప్రసాదించు శ్రీరామచంద్రుని గుణనామ కీర్తన ములు వర్ణన చేయదలచితిని.

నాలోని మలినములున్నప్పుడు శ్రీరామప్రభుని దర్శించగలనా? నా మలినములు గురుదేవుని పాదరజముచే పోగొట్టుకొని ధన్యుడనగుదును. స్వచ్ఛమగు కీర్తితో ప్రకాశించునా ప్రభుని దర్శించుటకు ముఖ్యకారణుడగు హనుమంత గురుదేవునా శ్రయించెదను.

నేను గతములో యెన్నెన్నో దోషము లాచరించితినని యాదోష ములకు ఫలితముగా యీ శరీరము ధరించితినని యిప్పుడు తెలిసికొని గురు స్వామి దయవలన చీకటిపోవగా సన్నని వెలుగుతో బాటను చూచుచున్నాను అందులకే పవన కుమారుడైన యాంజనేయస్వామిని సదాభజించి తరించెదను ఆయనయే నాకు బలము. ఆయనయే నాకు బంధువు. ఆయనయే నా కోర్కెలు తీర్చు మహాదాత. నేనాయనను నమ్మియుంటిని నా యజ్ఞానము నశింపుచేసి జ్ఞానదీపమును వెల్గించిన కారణమున నాలోని వికార గుణములు సమస్తము నశించినవి వాటి వలన వచ్చు బాధలు. దుఃఖములు పటాపంచలైనవి ఆ గురు దేవు నాశ్రయముతో సమస్త దుర్వికారుములు నశించి పోవుగాక! యని వర్ణిం చెను.

## చౌపాయి

(1) జయ హనుమాన !

జ్ఞానగుణసాగర !

జయకపీశ ! తిహులోక
ఉజాగర॥

ఆంజనేయస్వామీ! నీకు జయము! జయము—నీవు హనుమంత నామముతో ప్రసిద్ధిపొందిన బలశాలివి. నీవు నీ బాల్యమునందేయనగా జనన కాలమునందే యాకలిగొనినవాడవై యుదయించుచున్న సూర్యుని ఫలముగా భావించి గగనమునకు యెగిరిపోవుచుండగా నడ్డువచ్చిన వారిని నిర్లక్ష్యముగా గెంటిపోవుచుండ యింద్రుడు వజ్రాయుధముతో దవుడమీదకొట్టగా హనుతు నొక్కుడు పడగా నాటి నుండి యీ బిరుదుతో హనుమంతుడవైన స్వామీ! నీకు జయము.

నీవు మహాజ్ఞానముగలినవాడవు. నీ హృదయములో నిత్యప్రకా శుడగు శ్రీరామప్రభుని నిల్పుకొన్న గుణమూర్తివి హేవానర వీరా! ముల్లో కములలోన ప్రకాశవంతమగు కాంతులు నిండి వెల్గుచున్నవి నీ ప్రతాపము శాశ్వితమై శోభించి మమ్ము తరింపజేయుగాక.

(2) రామదూత! అతులిత బలధామా!
అంజనిపుత్ర! పవనసుతనామా॥

భావము:—

హేరామదూతా! గురుదేవా! నీవు రామచంద్రుని సందేశమును తలదాల్చి సంచరించు మహానుభావుడవు. నాడు శ్రీరామచంద్రుడు సీతాన్వేష ణము చేయుచు పంపా సరోవరప్రావము నందుండగా నీ సహజకుండలములు గుర్తించిన రామప్రభువునకు సుగ్రీవునితో సఖ్యముగూర్చి దూతకృత్యమును చక్కగా నెరవేర్చినవాడవు ఆ పిమ్మట సీతాదేవిని వెదకు వారులలో ముఖ్యు డవని గ్రహించిగదా నీకు శ్రీరామముద్రికను యీయలేదా? నీవు యెంత

కష్టము సహించి మహాసముద్రమును నూరు యోజనముల దూరము యోగ మార్గమున దాటి సీతను దర్శించి లంకా దహనము గావించి మహావేగముతో తిరిగి సముద్రము దాటి వానర వీరులను కలియలేదా! వారితో సీతాదేవి చూడామణిని రామునకిచ్చి వారిద్దరకూ దూత కృత్యము నెరవేర్చిన మహా ఘనుడు.

నీ బలమును యెవరు వర్ణించగలరు? నీ బలమును గుర్తించనవారు యింద్రుడు, దిక్పాలురు, శ్రీరామచంద్రుడు, మైనాకుడు, ఛాయాగ్రహము, లంకిణి, రావణ బలగము. అక్షయ కుమారుడు, ఇంద్రజిత్తు మొదలగువారలే ఎరుగుదురు. వాయుదేవుని తనయుడవన్న విఖ్యాతి నిలబెట్టినవాడవు. నీ వాంజనేయుడను విఖ్యాతిగన్న పురాణపురుషుడవు. నీ తల్లి యంజనాదేవి బ్రహ్మచర్య దీక్షలో నుండగా వాయుదేవుడు శివతేజము నాపి గర్భమున ఫలరూపముగా నందించ జన్మించిన కారణజన్ముడవు. నీవు నిజముగా శివాంశచే పుట్టినవాడవు.

నీవు వాయునందనుడవు. వాయువు నిన్ను నీ తల్లి యంజన గర్భముననుంచి నిన్ను కుమారునిగా నభిమానించినవాడు నీకు వజ్రాయుధం దెబ్బ తగులగా నిన్ను సమస్త ప్రపంచము దద్దరిల్లు వాయు దిగ్బంధనము చేయడా? కుమారునిపై ననురాగముంచలేదా? యట్టి పవనునకు కుమారుడవు పావనీ! నీకు నమస్కారము.

(3) మహావీర విక్రమభజరంగే
కుమతినివార సంతుతికే సంగే॥

ఓ గురువుదేవా! నీవు మహాపరాక్రమవంతుడవు. నీ పరాక్రమము ఎవరు వర్ణింపజాలరు. నిన్ను బ్రహ్మాదిదేవతలు నుతింతురు సీతాదేవికి

విశ్వరూపము చూపిన బలపరాక్రమములు ప్రకటించి యెట్లున్నావు తల్లీ! నిన్ను యీ సముద్రమును దాటించి నూరు యోజనములు గాదు లక్షయోజనములైనను గొనిపోవగలనని ధైర్యము చూపించిన మహా ప్రతాప మూర్తివి. నీ వీరత్వము యెవరు పొగడగలరు ? నిన్ను దేవతలు పరీక్షకు పెట్టి సురసను పంపలేదా ? ఆమె నోరుతెరిచి నిన్ను మింగబోవగా నాపె శరీరము మించిన శరీరము పెంచగా నామెయు పెంచినది. ఆమెను మించి నీవు పెంచలేదా ? చివరకు దేవమాయను యని నమ్మి సూక్ష్మ రూపముతో నాపె శరీరములో దూరి యీ వలకు వచ్చిన నీ వీరత్వము యెవరికి గలదు ? నీ వీరవిభవము వర్ణించగల నుద్దండులులేరు.

యుద్ధములో నీ వీరవిక్రమము వర్ణించగలరా ? నీవానాడు లక్ష్మణుడు మూర్ఛలో మున్గినప్పుడు విభీషణ. జాంబావంతాదుల ప్రోత్సాహముతో సంజీవిగొనిరా బయలు దేరలేదా ? మారీచ కుమారుడు కాలనేమి నిన్ను మోసగించ చూడలేదా ? అది యట్లుండ నిన్ను చంపుటకు జలాశయము వద్దకు పంపలేదా ? అందున్న భయంకర రూపములందియున్న మొసళ్ళను మింగనీయకుండా నీ శక్తితో వాటినీవల బడవేయలేదా ? దుర్మార్గులను దండించుటలో జంకులేకుండా నిల్చిన వాడవు. దురాగతులను నివారించు శక్తి వంతుడవు

నిన్నారాధించుచు శ్రీరామనామము గానము గావించువారలకు వెంట నిలబడి వెన్నుదట్టి రక్షించు ఫలదాతవు జగదీశుడవు. సమస్తశక్తులు నిన్నాశ్రయించు వారలకొసగు పుణ్యమూర్తివి. పుణ్యాత్ములగు వారివెంట నిలబడి వారి కూడగా శ్రీ రామచంద్ర దర్శనము గావించు మహానుభావుడవు.

(4) కంచనవరణవిరాజ సువేశా.
కానకుండల కుంచితకేశా

భావము:—

నీవు జగన్నాధమూర్తిగా నెరుగుదును. నీ శరీరకాంతులు సహస్ర సూర్యులు వెల్గునంత దూరము వ్యాపించు తేజోమయ రూపము వాడవు అనగా నీవు బ్రహ్మతేజముతో నిండియున్న పూర్ణరూపుడవు. పరబ్రహ్మము నీ యందే యున్నట్లు నీవు హృదయ చీల్చి చూపించిన తేజస్సంపన్నుడవు నిన్ను సామాన్యులు గారుగదా విశేషతపో విభవములలో నున్న వారలు కూడ చూడలేరు. నా పున్నెముకొలది నిన్నాశ్రయించు బలయోగము నాకు నాకు గలిగినది. నీ దివ్యరూపదర్శనము నుపదేశించదలంచు దయాకిరణము నామీద ప్రసరించిన మహానుభావా ! నమస్కారము. నిన్నధ్యాత్మ విదులు గాని దర్శింపజాలరు.

నీవు స్వయముగా ప్రకాశించు మూర్తివి. నానావిధములగు వేష ములు ధరించి లోకములందలి భక్తుల నుద్ధరించు మహానీయుడవని యెరిగితిని నీవు జన్మతో దివ్యకుండముల ధరించిన ప్రభుడవు. నీ కుండములు నీ దివ్య రూపము యెవరు చూడగలరు. నాడు సుగ్రీవుడు నిన్ను దూతగా పంపి నప్పుడు మారువేషముతో రామలక్ష్మణులను దర్శించలేదా ? వారితో రాజ నీతి ధర్మసూత్రములను కలిపి వారితో సంభాషించిన నీ పాండిత్యమునకు రామచంద్రస్వామి నిన్ను గ్రహించలేదా ?

నీ ప్రభువునకు మాత్రమే కన్పించిన కుండలములు చూచియే మన్నాడు శ్రీరాముడు. నీవు మారుతీవేషముతో నున్న దేవతామూర్తివిగాని సామాన్య వానరడవుగావు నీవెవరవని ప్రశ్నించలేదా ? నీ మకరకుండ

లములు యితరుల కగుపించినవా ? దేవదేవుడు నిన్ను గ్రహించి చేబట్టి నాడు విచిత్రకాంతులు జిమ్ము కేశపాశము గల స్వామివి నీవనెను

(5) హథవజ్ర అరుధ్వజావిరాజై!
కాంధేమూంజ జనేవూసాజై॥

భావము:—

ఓ వానర స్వామీ ! నీవు బాహ్యమునకు వానరరూపముగాను నున్నావు గాని జీవులలోని చంచల మర్కట స్వభావముల వారిని శిక్షించియో రక్షించియో దగ్గరకు జేర్చగల దయామయుడవు నీ బాహువులు వజ్రముతో సమానము. నీ హస్తతాడనము తగిలిన మాత్రమున యెందరు బలవంతు లగు రాక్షసవీరులు యుద్ధములో మృతి చెందలేదా ? నీ చేతిలో రామధ్వజ మున్నది నీవు రథముగా రామరావణయుద్ధములో నుండ లేదా ? నీ చేతిలో రామధ్వజమును రథమునకున్నట్లు ధరించి సంచరించలేదా ? ని చేతిలోని ధ్వజము చూచే శత్రుసైన్యములు వానరవీరుడు హనుమానుడని గ్రహించి ప్రాణములు వదలిపెట్టలేదా ? శ్రీరామ ధ్వజము సామాన్యమా ?

నీ చేతిలోని ధ్వజము భూమ్యాకాశములునుండి నిలబడినదిగదా! ఆ ధ్వజమోంకారనాదము చేయుచు మహా శబ్దమునకు శత్రువులు గుండెలదరి పోవగా మహాభక్తులు పొంగిపోవగా శ్రీరామ పరబ్రహ్మ మధ్యనింపచేసిన మహాభక్తి శిఖామణివి నీవు బ్రహ్మ చర్య దీక్ష పూనినవాడవు. పర కాంత లను మాతృ దేవతలగా దలంచి పూజించు బ్రహ్మచారివి. నీ ధరించిన బంగారు జందెములు యెవరు దర్శింపగలరు? వాటిని దర్శించిన బంధనములు తొలగిపోవా? నీవు కాపాడవా? గాథమగు బ్రహ్మచర్యమునకు నీవాదర్శ మూర్తివి. జగదీశుని సన్నిధిలో హృదయమర్పించిన ధన్యుడవు.

యజ్ఞోపవీత దీక్ష బూని హృదయమగు హోమద్రవ్యమును పర బ్రహ్మమను యగ్ని దేవుని యందు హోమము చేయగా దీక్షగా జందెములు ధరించిన పావనమూర్తివి నీకు పదే పదే నమస్కారములర్పించెదను కటాక్షింపుము.

(6) శంకరసువన కేసరీ నందన
తేజ ప్రతాప మహాజగవందన॥

భావము:—

నీవు శంకరుడువు శంయనగా శుభమును కల్గజేయు స్వామి శంకరుడ వందురు. నిన్ను దలచినవారికి సమస్త శుభములుగల్గును. ఏ యశుభములుండవు. నీవు శివస్వరూపుడవగుటచేతనే యింద్రాదులు నిన్ను జయించలేక పోయినారు. చిరంజీవి వై యున్నావు నాడు శంకర తేజమును వాయు దేవుడు పత్రపుటములో నుంచి యంజనాదేవికిచ్చిన కారణమున నీవు శంకరుడవు అంజనాదేవివానర ప్రభుడగు కేసరికి పత్నియగుటచే నీవు కేసరీ నందనుడవైనావు నిన్ను గర్భములో ధరించిన యంజనయున్న పర్వతరాజు నీ స్వరూప భారము మోయలేక క్రిందకు కూలబడలేదా ? నేను ఈ భారము మోయలేననలేదా ? నీ భారము యెంతో యెవరు గణించగలరు?

నీవు తేజోమూర్తివి నిన్ను కన్నెత్తి యెవరు చూడ గలరు ? నీ ప్రేమ యెవరు గ్రహించగలరు ? నీ ప్రతాపము యెంత గొప్పది. నాడు సుగంధ పుష్పములకు నీ తమ్ముడు భీమ సేనుడు పోవుచుండగా యెంత వింతచేసి నువు నీ తమ్ముని యందెంతప్రేమ చూపించినావు వృద్ధవానర భయంకర రూపము దాల్చిదారికడ్డుగా పరుండలేదా ? బలగర్వముతో పోవు చున్న నీ తమ్ముని గ్రహించికదలలేనట్లు పరుండ తప్పుకొమ్మన్నాడు గదా

నీవు యిచ్చిన సమాధానము యెంత గొప్పది ముసలి వానరుడను నీవు తోకను తప్పించుకొని పొమ్మనలేదా ?

దానితో నాతడు చేతితో నెత్తబోవ తోకక్రింద చేతిని నొక్కిరానీ యకపోగా గ్రహించి నిన్ను దేవతామూర్తిగా పొగడినాడు అప్పుడు నిజ రూపముతో తమ్మునెదుట నిల్చి దీవించి పంపిన ఘనుడవు ప్రపంచమునం దలి ప్రజలందరి వలన నుతులు పొందుచుండు సకలజనులకు పూజ నీయ మైన మూర్తివి గురువారా! నాసాష్టాంగ వందనము.

(7) విద్యావానగుణీ అతిచాతుర!
రామకాజకరి వేకోఆతుర॥

భావము:—

నీవు నేర్వని విద్యలేదు. నీ విద్యాభ్యాసము విచిత్రమైనది. సకల వేద శాస్త్రములు బోధించగలిగిన మహా తేజోమూర్తి సూర్యభగవానుడు. ఆయన నిత్యము సంచారము చేయువాడు. ఉదయ పర్వతము నుండి యస్త గిరి వరకు సంచారముచేయు గురువువద్ద యెట్లు విద్య నేర్చుకొన్నావు స్వామీ! ఉదయగిరి నొకకాడ యస్తగిరి మీద నింకొక కాలు పెట్టిసీ చెవిని గురుదేవుడగు సూర్యుని సమీపమున నుంచి చతుర్వేదములు ఆరుశాస్త్రములు యితర దివ్యకళలు కష్టపడి సంపాదించిన దిట్టవు నీవు వ్యాకరణములు నేర్చిన ఘనుడవు సద్గుణములన్నియు నీ సొమ్ము నేర్పరి తనము నీ యందే యున్నది. నీకు చతురుపాయములు చేతిలో నిమ్మపండు వలెనున్నవి. ఎవరు నిన్ను దలచిన వారికి సమస్తవిద్యలు చాతుర్యము. సాహసము ధైర్యము బలము సమస్తరోగ నివారణము భూతప్రేతాదుల భయరాహిత్యము గల్గించు భక్తచింతామణివి.

నీవు శ్రీరామ భక్తాగ్రేసరుడవు. నీ యంతవిశ్వాసము గల స్వామి భక్తిపరుడు జగములందెవరున్నారు. నీ విశ్వాసము, స్వామి భక్తి ప్రభువు నెంతగా నానందపరచినదో నిన్ను కౌగిలించుకొని తనలోకలుపుకొన్నాడు. అందుచేతనే ఘురవరదాస బిరుదమందిన ఘనుడు. ఎవరికీ బిరుదువచ్చును. రావణునికొలువులో నివు చెప్పిన సందేశ వాక్యములలో నెంత చాతుర్య మున్నదో రసజ్ఞులగు వారికే తెలియగలదు.

అంతటి పరాక్రమశాలినవలీలగా తృణీకరించిన నీ రామభక్తి మహిమ శేషుడుగాని చతుర్ముఖుడుగా నివరించజాలడు. శ్రీరామ నామ సంకీర్తనమే లోకములందు గావించినను నీ చెవినిబడును. నీవచ్చటనే యుందువని మహామునులు వచించెదరు.

(8) ప్రభుచరిత్ర సువివేకోరసియా।

రామలఖన సీతామనబసియా॥

భావము:—

నాడు నాకు దర్శనమీయబోవు సమయములో నెక్కడున్నావు? కాశీనగరములో సద్బ్రాహ్మణుని యింట జరుగుచున్న శ్రీరామ చరిత్రము పురాణముగా సాగుచుండగా ముసలిబ్రాహ్మణరూపము ధరించలేదా? విచిత్ర వేషములు లోకములందలి వారువెరుగకుండా సంచరించు సత్యమూర్తివి. ప్రారంభము నుండి యీశాన్యదిశలో గూర్చుండి పరమానందముతో ప్రభువరుని చరిత్రమాలకించలేదా? నేత్రముల నుండి కన్నీరు బొటబొటకార్చలేదా? నీ విషయము నేను చూడలేదా? నాకు తెలిసినది. రామకథలోని సంతోషము హృదయోత్సాహము నీకు తెలిసినట్లు యెవరు తెలిసికోగలరు?

అందుచేతనే నిన్ను రామ కథామృతరసము నిరంతరము పానము చేయువాడవని నుతింతురు.

నీవు రసము త్రాగిత్రాగి మహానందముతో సగము మూసిన నేత్రములతో మత్తుగా చిందులు త్రొక్కుదువు. రామకథారసములోని మాధుర్యము తన్మయత్వ కారణము నీకు పూర్ణము తెలియుటచేతనే నీ వంటి రామ భక్తిపరుడు యెవ్వడూ లేడని ప్రపంచఖ్యాతి సంపాదించుకొన్నావు. నీ హృదయములో సీతారామలక్ష్మణులకు నివాసము గల్పించి యుంచుకొన్న స్వామి భక్తపరుడవు శ్రీరామునితో సంగ్రామము నారధుని మునీ కల్పింపబడినది గదా! ఆ రాజును వదలమన్న వదలననలేదా? నా ప్రాణములిత్తును గాని వదలనని స్వామితోడీ కొన్నవాడవు.

నీకు యెవరు బలమన్న రాముడన్నావు నేనేకదా నీ బలమైన నన్ను తిస్కరించెదవా? నీ మాట సాగదనగా రామా! నా హృదయములో సీతారామలక్ష్మణులున్నారని హృదయము చీల్చి చూపిన ఘనుడవు రామదాస స్వామివి. నీకనేక వందనములు.

(9) సూక్ష్మరూపధం సియహిం దిఖావా
వికటరూప ధరిలంకజరావా॥

భావము:—

శ్రీరామచంద్రుడు వనవాసము చేయుచుండ రావణుడు సీత నపహరించగా సుగ్రీవునితో సఖ్యము చేయించిన ఘనుడవు సీతను వెదకుటకు నలుదిశలు పంపిన వానరవీరులలో నీవు ప్రముఖుడవు కదా? దక్షిణదిశలో రావణుని నివాసమని నిన్ను విశ్వసించి కార్యసాధనము గావించువారిలో ఘనుడవని రామ ప్రభుడనుకొనిగదా! నీ కంగుళీయక మిచ్చినాడు, నీవు

సామాన్యుడవా? యనేకరూపములు దాల్చగలవు. అనేక శక్తులు ప్రదర్శించ గలవు. అనేక గమనములుగా నడువగలవు నీవు ధరించిన యన్ని రూపము లలో సూక్ష్మరూపమెంత గొప్పది. లంకానగరము ప్రవేశించినప్పుడు యే రూపముతో నున్నావు? లంకిణి మహాశక్తివంతురాలు గాన నిన్ను కనిపెట్టి నది. వెంటనే యా సూక్ష్మరూపము వదలి భీమరూపము ధరించి దానిని యించలేదా?

అక్కడ నుండి సీతను వెదకుచు దోమవంటి సూక్ష్మరూపమున గదా! లంకలో సీతను వెదుకనారంభించితివి. ఆకు ఆకు మధ్యను సీతాదేవి యున్న యశోకవృక్షముననుండి పరులకు గనరాకుండా మసలలేదా? సీతా దేవి నిన్ననుమానించునని సూక్ష్మరూపముతో గదరామకథాగానమారంభించి నావు. ఆ సూక్ష్మరూపముతోనే సీతామాతృ దర్శనము గావించుకొన్నఘను డవు. నీవు బహురూపములు ధరించగలవన్న దానికి నిదర్శనము వినుడు రాక్షసులు చుట్టుముట్టినారు.

నీవాసమునకు నిప్పంటినారు నీవప్పుడే రూపముతో నున్నావు? వికటరూపము ధరించలేదా? నీ భయంకరరూపమునకు లంకానగరమంతయు గడగడలాడలేదా? గురుదేవా! నీ మహిమలెవడెరుగును? లంకాదహన కార్య మెవడు చేయగలడు? నీవద్భుత పరాక్రమమూర్తివి! ప్రభో! నీకు నమస్కా రము.

[10] భీమరూపదరి అసుర సంవారే!
రామచంద్రకే కాజసం వారె॥

భావము:—

నీవు భయంకర రూపము ధరించగల సామర్థ్య మున్నవాడవని నీ చరిత్రయే చెప్పును. కాలనేమి యా నాడు నిన్ను మోసగించి మాయాముని

వేషముతో నాశ్రమము కల్పించినాడు గద! వానిని నమ్మి నీవు ముందువానికి పాదాక్రాంతుడైనావు నిన్ను సంహరించి రామకార్యము భగ్నము గావించ రావణుడు పన్నిన పన్నాగము గానయందు చిక్కుపడితివి. దాహమనగా నీకు యా పెద్ద మొసళ్ళున్న చెరువులో నీరు త్రాగమని పంపించలేదా? నిన్ను మొసలి రూపముతో నున్నయప్సరస పట్టుకొన చేతితో పట్టువిడిపించుకొని బయట కు పడవేయ నిజరూపమందినది గదా! తన చెలికత్తెలకు గూడ శాపవిడిపించి నీకు కాలనేమి వృత్తాంతము చెప్పినది గదా! అప్పుడు నీ చాతుర్యము గమనించదగినది.

వావి వద్దకుపోయి "గురువర్యా! దాహము తీరినది మీ ఋణము తీర్చుకోలేను. బహుమతిని గ్రహింపుడని యెంత గ్రుద్దు గ్రుద్దినావు వాని మాయా వేషముల కాటగట్టించినావు వికృతరూపునికాలనేమని భీమరూపముతో సంహరించలేదా? ఎంతమంది రాక్షస వరులను భయంకర రూపముతో సంహరించినావు. నీవు నా పుణ్యము కొలది గురుదేవుడవైనావు. నీ మహ శక్తులు. నీ యోగబలము. బ్రహ్మ చర్య వ్రతము నెవరు బూనగలరు? వాటి నెవరు నిగ్రహించగలరు? స్వామీ! నీవు రామచంద్ర ప్రభునకు రధముగానున్నవాడవు.

అనగా నీ శరీర రధముతో మహావీరాగ్రణిధనుర్ధారియగుల రామ ప్రభుని ధరించి స్థానముంచి నిరంతర మారాధించు పరమోత్తమ పుణ్య మూర్తివి నిన్ను స్మరించిన యేయశుభములురావు నీ యందను నన్ను నిల్పు కొన్న దయామయమూర్తివగు నీకు వేనవేలు నమస్కారములు.

(11) లాయసజీవన లఖనజియాయే।

శ్రీరఘువరహరాభి ఉరలాయే॥

భావము:—

ఓ ఆంజనేయ ప్రభూ! నీవు లక్ష్మణ జీవనము యిచ్చిన నెరదాతవు. నీ వంటి స్వామి భక్తి పరుడున్నాడా? ఇంద్రజిత్తు ఘోరమగుబాణము ప్రయోగించి లక్ష్మణుని మూర్ఛగావించి నాడుగద! రాముడు తన తమ్మునికి వచ్చిన కష్టమునకు మహా విచారముతోనున్నాడు తన తమ్ముని బ్రతికించుటకుపాయము తెలియక బాధపడుచున్నాడు ఆ సమయములో బలవంతుడు వృద్ధుడగు జాంబవంతుడు రాముని చూచి ద్రోణగిరి మీద సంజీవి తెచ్చిన బ్రతుకునన్నాడు ఆ మాటలు విని తెల్లవారులోపున ద్రోణగిరిమీద సంజీవి తెచ్చు సమర్థుడెవరని వారిలో వారు తర్కించుచుండిరి. రామ సేవా! ధురంధరుడు హనుమంతుడు దానికి సమర్థుడన్నాడు గద! వానిని పంపమన్నాడు రామాజ్ఞతో పరుగుమీద బయలుదేరినాడు.

దారిలో యెన్నో చిక్కులు దాటి ద్రోణగిరిజేరినావు గద! నీ సాహసము వర్ణింపతరమా! అందులో సంజీవి యేదియో తెలియక వెంటనే ద్రోణ పర్వతమునే చేతిలో పెట్టుకొని బయలుదేరి వచ్చిన మహావీరుడవు గురుదేవా! మహాప్రభలతో వెల్గొందుచున్న పర్వతమును చూచి సూర్యోదయమైనదని బాణమెక్కు పెట్టబోవగా యది ద్రోణాద్రియనీ చెప్పులోన నీవు వచ్చి ముందు గిరీంద్రమునుంచినావు సంజీవిని జాంబవంతుడు గ్రహించి లక్ష్మణుని బ్రతికించిన వాడవు నీ వంటివాడున్నాడా? శ్రీరామచంద్రమూర్తికి హృదయానందము కల్పించినవాడవు.

నిన్ను చూచి రామప్రభువు "నా సోదరుని బ్రతికించి దుఃఖము పోగొట్టిన నీవు నా సోదరులలో నొకడవేను యని తనయనురాగము వెల్లడించునట్లుండి దహను మాన్ దేవా! నిన్ను యెట్లుపొగడగలను? నా హృదయము

నీ కర్పించి నిన్ను సేవించినవారికి మరణ భయములు లేకుండా సంజీవిగా నుందువని నా నమ్మకము.

(12) రఘుపతికి కిన్హీ బహూతబడాయీ!
కహా భరత సమతుమ ప్రియ భాయీ॥

భావము:—

నీవు రామచంద్రప్రభుని ప్రశంసలనెట్లు పొంది నావో దేవతలు కూడ పొందజాలని విధముగా పొందినావని నేననుచున్నాను రామచంద్ర ప్రభుని సేవించుటకు నీ కన్నగాని నీ వెనుకగాని యెవరైన నిలబడినారా? నీవు ప్రభుని వలన పొందిన ప్రశంసలు యెన్ని యున్నవో నేను వర్ణించు చున్నాను సుగ్రీవునితో సఖ్యము చూపించినావు. సీతాన్వేషణములో ముంద డుగువేసి అందగమైంద. ద్వి విద జాంబవంతాదులతో దక్షిణదిశకు ప్రయా ణముగాలేదా? నిన్ను విశ్వాసపాత్రునిగా దలంచి చేతియుంగరము నాన వాలుగా నీకే యీయలేదా? నీ యంతవాడులేడని ప్రశంసపొందలేదా? నూరు యోజనములు సముద్రముదాటి సీతాదేవి క్షేమము గుర్తించుటలో ప్రముఖ త్వము పొందలేదా? లంకాదహ కార్యమెవరు చేయగలరు? సీతాదేవి చూడా మణిని మరల రాముని కందీయలేదా?

ఇట్లు సీతారాముల సేవయందే నిమిడియున్న నీ దీక్షను ప్రశం సింపక రాముడుండునా? లోతుగుండెగల రామచంద్రస్వామి యితరుల హృదయము లెరుగునుగాన నిన్నే నియమించినీ వలన తన కార్యసాధన ముగా వించుకొని తృప్తిచెంది నిన్ను ప్రశంసించినాడు అట్టి జగదీశుని ప్రశంసల నందుట సామాన్యులకుగాదు గదా దేవ గణమునకు కూడ తరము గాదని చెప్పవచ్చును నీవు మందళ దేవతవు. నిన్ను స్మరించినను, ధ్యానించి నను శరణమువేడినను సమస్తశుభము లనొసంగువరదాతవు.

నిన్ను రాముడు పరమనిష్టతో సోదర భక్తిని స్వార్థము వదలి ప్రకటించి యున్నాడన్న పోలికతో భరత సమాన గౌరము నీ కిచ్చి యున్నాడు రాజ్యము వదిలి యన్నగారు ధరించిన రీతిగా వస్త్రాదులు ధరించి అన్నను చూచు వరకు నేలపై పరుండి భోగములు వర్జించిన కఠినదీక్షాశాలితో సమముగా నిన్ను ప్రశంసించినాడు.

(13) సహసవదన తుమ్హరోయశగావై।
అసకహిశ్రీపతి కంఠలగావై॥

భావము:—

ఓ ఆంజనేయస్వామీ! నీవు వేయి ముఖములతో సంస్తుతుల పడసినావు. అనగా శేషుడు వేయి ముఖములవాడు తన ముఖములతో నిన్ను పొగడుచుండును అక్కడకు తృప్తి పొందుటలేదని భావము నీ మహిమను కోట్లాది దేవ గణములానాడు సూర్యబింబమును కబళించబోయినప్పుడు గ్రహించలేదా? వజ్రాయుధముతో నిన్ను యింద్రుడు కొట్టగా నీవు పర్వత పార్శ్వములోపడి పోవగాన తండ్రి యది విని నిన్ను సమప గుహాకడకుగొని పోయి యందు నిల్పి తన చలనము మానియుండలేదా? సమీస్తలోకములు వాయువు బంధనముతో గడ గడలాడిపోయి బ్రహ్మదేవు నాశ్రయించలేదా? బ్రహ్మయింద్రాదులను వెంటబెట్టుకొని నీ తండ్రి నిన్ను యొడిలో పెట్టుకొని కూర్చున్న స్థలమునకు వచ్చినారుగదా. వారందరు నీ తండ్రిని స్తమములువ గావించినారు. నిన్ను మించి సాకెవరక్కరలేదని వారిని నిర్లక్ష్యము చేసినాడు.

వారందరు నీ తండ్రిని బ్రతిమాలి నీ తండ్రితో నిట్లన్నారు. నీవు యింతమందికి ప్రాణాధారమవ్వగద నీవు లేకున్న సృష్టిసాగదు. నడువదని యనగా మీరందరూ నా కుమారునికన్న యెక్కువగాదు. నేను నా చలనము సాగనీయను పొందనగా వారందరు వారి వారి యాయుధములతో మరణము

లేకుండా వీరమీయలేదా? నిన్ను నీ తండ్రి రక్షించినప్పుడు సహస్రవదన ములతో స్తవములుగావించినారు.

నీవు శ్రీరామచంద్రుని యాలింగన భాగ్యముపొందిన మహాను భావుడవు. నీ కన్న ధన్యుడు లేడు. నిన్ను నేను సదానుధ్యానించి తరించెదను. పరమున నీవు శ్రీరామప్రభు మందిరమునకు చేర్చగల నా యధిదేవతవు.

(14) సనక సనాదిక బ్రహ్మాదిమునీశా!
నారద శారద సహిత అహీశా॥

భావము:—

మహానుభావా! కపీంద్రా! జగదేకవందితనామా! నీవు సనక సనం దన. సనత్కుమారసనత్సుజాతాదులు యెవని దివ్యమహద్వారమునకు ప్రవే శము ముందు నీ యనుజ్ఞపొందవలసి నయంత మహానుభావుడవు. బ్రహ్మాది దేవతలు నిన్ను ఘనముగా నిరంతరము స్తవములు చేయుచుండుటాశ్చ ర్యము నిన్ను నీ నామగానము నారద మునీంద్రుడు సంతతము చేయుచు నేను తరించి నాననియుప్పొంగు చుండునుగదా! వాణీదేవి నీయనంత ప్రతా పమును యెన్ని గతుల పొగడచుండునో దేవగణములకే యెరుక ఎవరు పొందలేని రామనామ గానము నిరంతరము భజించు పార్వతీ శంకరులు కూడ నిన్ను పొగడుటయెంత వింత? రామతారకమంత్రమును జపించి యం దులో నున్న మహిమ గ్రహించిన వారిలో నాదిదంపతులు పార్వతీ శంకరుల మించినవారు లేరని యందురు. అట్టివారలు సహితమాంజనేయుని మించిన రామభక్తిపరుడులేడని వేనోళ్ళచాటుచున్నారు.

శేషుడు సర్పజాతిలో జన్మించినవాడు. వారి ముఖములలో విష ముండును. కాని శేషుడు తన సహజ విషము నుపసంహరించి మహామతితో

శ్రీపతి సేవయందు బుద్ధి గల్గి వెంటనే వైకుంఠమున్న క్షీరసముద్రములో ప్రవేశించి యా హరికి పాన్పుగా మారిపోయినాడు. అట్టి శేషుని దర్శించుటకు యెట్టివారు వత్తురు.

ఆ మహానుభావుడే తన వేయితలలతో నిన్ను శ్రీరామభక్త శిఖామణివని నిరతముగానము చేయుట విని బ్రహ్మేంద్రాదులు విడువక నిన్ను పూజించుట ధ్యానించుట నీ నామ జపము గావించుటచేయుటచే సహస్ర విధముల సహస్రముఖముల నిన్నభినందించుచున్నారు గురుదేవా! సకల దేవపూజ్యుడవగు నీకు నా నమస్కారము.

(15) యమకుబేర దిగపాలజహాఁతే
కవికోవిదకహి సకై కహాఁతే॥

భావము:—

నిన్ను అష్టదిక్పాలురు పొగడుచుందురు. వారు సామాన్యులా! సమస్త ప్రాణులను తన పాశదండములతో కట్టిగొనిపోయి తన రాజధానిలో నిల్పి విచారణచేయువాడు వారివారి కర్మల ననుసరించి శిక్షలు విధించి సంచరించు ధర్మమూర్తి ఆయన పేరు చెప్పిన లోకములన్నియు భయముచెందుట లేదా? ధర్మశాస్త్రము ననుసరించి జీవుల కర్మఫలము ప్రకారము దయాదాక్షిణ్యములు లేకుండా చూచిన నీ చర్యలు గమనించిననాడు తాను నీ తండ్రికిచ్చిన వరము ప్రకారము మరణమను మాటలేకుండా చిరంజీవిత్వము నిల్పియున్నాడు. నీవు చిరంజీవివి. ప్రపంచములో ధనవంతులలో నగ్రగణ్యుడు కుబేరుడు. ఉత్తర దిక్కున కధిపతి తనవద్ద నవ నిధులున్న సంపన్నుడు. అన్ని నిధులతో యెన్ని తీసినను తరుగులు లేకుండా యున్నేయున్నవాడు పైన శంకరునకు స్నేహితుడు. అంత బలవంతుడు ధనవంతుడు. గొప్ప

పాప్రపుగలవాడు నిన్ను చూచి నీ నామము దలచి నీ ప్రభుని సేవతో నింత గొప్పవాడు లేడని తన సభలలో ప్రకటించుచున్నాడు.

అగ్నిహోత్రుడు నీ మహిమ యెరిగినవాడు గద! ఆనాడు లంకా నగరములో నీ వాలమంటించి నిన్ను బాధించ దలచిన రాక్షసులకెంతటి భయ సందేహములు పుట్టినవో నీవు యేమాత్రమైనకమలినావా? నిప్పుసెగ తగిలినదా?

అదియంతయునగ్ని దేవుని మహిమయో! నీవు నిరంతరము జపించు తారకమంత్రబలమో! నిన్ను పండితులు. మహాకవులు. విజ్ఞానులు. యెడతెగని భక్తితో నీ నామము స్మరించుచుందురు అందరివలన పూజలందు గురుస్వామీ! నీ కీర్తి శాశ్వతము నీకు నమస్కారము.

[16] తుమ ఉపకార సుగ్రీవహిం కేన్హా
రామ మిలాయరాజపద దీన్హా॥

భావము:—

నీవు సుగ్రీవునకు చేసిన యుపకారము నెవరు వర్ణింపగలరు? ఆనాడు వాలి తన సోదరునితో బయలుదేరి. రాక్షసునితో యుద్ధముచేయుచు గుహలో నుండగా రక్త ప్రవాహములు, రోదనలు విని భయపడి పెద్దబండ నడ్డుపెట్టినాడు. తాను యికదారిలేక కిష్కింధకురాగా రాజులేని రాజ్యములేని రాజ్యముపనికిరాదనిపట్టాభిషేకము మంత్రులు గావించినారు. వాలి యుద్ధము చేసి గృహాద్వారమునకడ్డముగా రాతినుంచిన తమ్ముని ద్రోహునిగా నిర్ణయించెను. పరుగుమీదవచ్చి సుగ్రీవుని రాజ్యభ్రష్టుని గావించి వాని భార్యను చెరబట్టి తరిమి వేసెను సుగ్రీవునకు శరణ్యములేదు.

ఆంజనేయస్వామీ! నీవు చేసిన యుపకారములలో ముఖ్యమైనది. మతంగ మహాముని శాపమున వాలి ప్రవేశింపరాని గిరిమీద నీవు సుగ్రీవుని నిల్పలేదా? వానికి మంత్రాంగము నెరపలేదా? అదికాక జటావల్కల ధారులు, ధనుస్సులు అమ్ములపొదలు ధరించిన రాజపుత్రులను పంపాతీరమున చూచి సుగ్రీవుడు వాలిచే పంపబడ్డవారనుకొని భయమందలేదా? నీవా భయము పోగొట్టి నేను పోయి విచారించెదనని మారువేషముతో రామలక్ష్మణులను దర్శించి వృత్తాంతము తెలిసికొనలేదా? వారి విషయమెరిగినా వానరరాజు సుగ్రీవునితో స్నేహము గావించిన సీత విషయము తెలియ గలదని చెప్పి వారిద్దరకు గాఢమైత్రికుదిర్చి యుపకారము చేయలేదా? నీవు చేసిన యుప కారమెవరు చేసినారు.

శ్రీరామునితో నేస్తముకుదిర్చి వాలివధను గావింపజేసి రాజ్యము సుగ్రీవున కిప్పించిన మహామంత్రి సత్తముడవు. రాజనీతి నెరిగినవాడవు శ్రీరామ సహాయము సుగ్రీవున కందించి శాశ్వతోపకారము గావించిన గురు దేవా! నమోనమః

[17] తుమ్హరోమంత్రవిభీషమానా
లంకేశ్వరభయే సబజగజానా॥

భావము:—

ఆంజనేయా! నీ మహిమలనంతములు. నీవు గదా విభీషణునకు మానరక్షణము గావించిన ప్రాణమిత్రుడవు నాడు రావణుడు సీతను గొని వచ్చి లంకలో నిల్పిన సమయములో సీతాన్వేషణకు నీవు బయలుదేరి వెళ్ళి నావు. అర్ధరాత్రమున లంకానగరము శోధించు సమయములో లంకాపురిలో రామనామ గానము జరుగుగృహమును గుర్తుగా నీవుంచుకొన్నావు. అందులో

రాజగృహముల పంక్తిలో విభీషణగృహమని యజమాని నామము చూచి యెంత పొంగిపోయానో! అది నీవు మరచినావా? ఇది యంతయు నీ రామ భక్తి విశేషముగా నేను తలంచెదను నాటి నుండి విభీషణుని పేరున హృదయములో శిలాఫలకముపై వ్రాసి నటుంచుకొన్నావు. అప్పుడు జరిగిన విషయము యెంతగా విభీషణున కుపయోగించినదో! నేను చెప్పుచున్నాను.

రావణునిపై మీరు వానర వీర వరులతో మహా సైన్యముతో దండెత్తి సముద్ర మావలిగట్టున విడిసి యున్నారు గదా! రావణ సభలో రాముడు వానర బలముతో వచ్చి సముద్ర మావలిగట్టుననున్న వారు వారిని జయించు నుపాయము చెప్పుడని రావణుడన్నాడు. అందరు తలకొక రీతిగా చెప్పగావిని విభీషణుడు వారిని వారించి యేమన్నాడు అన్నా రావణా! రాముడు మానవుడుగాడు శ్రీహరిగా నెరుగుము నీవు చేసిన పని మంచిది గాదు. సీతను రామున కర్పించి క్షమార్పణవేడు మనరాజసభలో కాలితో యగౌరవము చేసినాడు.

వెంటనే మంత్రులతో బయలుదేరి రాముని శరణువేడ రాగా మిగిలిన వారందరు రావణుని తమ్ముడు శత్రువు శరణీయరాదన్నారు. ఆతనిపై వారలుగాదా వారిని వారించి తాను లంకలో శ్రీరామముతో భక్తుని విభీషణుని చూచి నానని శరణమిప్పించిన మహా ఘనుడవు రావణభయము విభీషణునకు తప్పించి పుణ్య శాలివి. జయము! జయము!

(18) యుగసహస్రయోజన పరభానూ!
- లీల్యోతాహి మధుర ఫలజానూ॥

భావము:—

దేవా! నీవు మహాపరాక్రమవంతుడవు చండ భుజ విక్రముడవు నీ జన్మ రహస్యము దేవతలే యెరుగజాలరు నీవు సాక్షాత్తు శివుడవే సృష్టి

స్థితి కారణములు నీ వలనే జరుగుచున్న విలయ కాలములో నీవు విజృంభించి సమస్తము లీనము గావించుకొను బ్రహ్మ స్వరూపుడవు నీవు జన్మించగా నాకలి భరించలేకపోయినావు. నీ సోదరుడు భీముడే బొటన వ్రేలంత జఠరాగ్ని గలవాడైనాడు గద! నీ కెంత జఠరదీప్తియున్నదో! సూర్యుని ఫలముగా భావించి పుట్టుకతోడనే కొన్ని వేల యోజనముల దూరములోనున్న సూర్యమండలము మీదకు యెగిరి భానుని పట్టుకొన బోవలేదా? ఆ వింత చర్యకు దేవలోకములు భీతిల్లి పోవలేదా? నీ మహిమ యెంతటిదో యీ పనిని తలచి యోచించిన తెలియదా?

నీవు మధురఫలముగా భావించలేదా? నీ గమనము చూచి గ్రహమండములు జ్యోతి ర్గణములు గగన చరులగు దేవతాసముదాయములుదద్దరిల్లి పోలేదా? ఎవడు నీకు సాటి నీవు యంతటి తేజోమూర్తివి రెండు చేతులతో బట్టుకొని మ్రింగబోవుట యెంతటి విచిత్ర విషయము భానుమండ లమును మ్రింగబోవ భావించి బ్రహ్మ నాశ్రయించిసారు గద! నీ విషయము బ్రహ్మ యొకడే గ్రహించినాడు. తొందరపాటున యింద్రుడు వజ్రాయుధముప్రయోగించినాడు.

నీకు గతా గతములు త్రికాల విషయములు తేట తెల్లముగా తెలియును నీ వంటివాడు మరొకడులేడు. నీ బలమంతయు రామతారకమంత్ర బలముతో వచ్చినది. నీ జపము లోకములనుర్రూతలూగించినది. ఇంతవారిగా చేసినది నీలోని బలము రామ మంత్ర బలముగా నెరిగితిని.

(19) ప్రభుముద్రికా మేలిముఖమాహీం!

జలధి లాఘిగయే అచరజనాహీం॥

భావము:—

హనుమంత గురుస్వామీ! నీవు సముద్రమున నూరు యోజనములు దాటినావన్న యదియంతయును బలమా? నీవు ధరించిన శ్రీరామ నామాంకితముద్రికా బలముగా నేను చెప్పగలను. నీకు రామనామ మహిమ బాగుగా తెలియునుగాన నేను తగినవాడనని సీతాదేవిని వెదకుటకు బయలు దేరిన వాడవు. వానరవరులతో దక్షిణ దిశగాపోవుచు స్వయంప్రభ గుహలో ప్రవేశించి సీతాగా నామెను భావించగా తన చరిత్రము విని లంకను జేరుటకు నూరుయోజనముల దూరమున్న సముద్రముదాటుట యెట్లని సందియము బయలుదేరలేదా! ప్రతి వానర వీరుడు వారు సముద్రముదాటు ప్రయాణము చెప్పగా వినలేదా?

అందరు సముద్రముదాటి లంకలో ప్రవేశింప శక్తులుగారని జాంబవంతుడన్న మాటలు యెరుగవా? వానర వరులార! మీరెందుకు జంకెదరు. మనలో మహ పరాక్రమశాలి యున్నాడు. ఆతడు రామ కార్యము చక్కబెట్టగలడు మీరు విచారము వదులుడని నిన్నేమన్నాడు.

ఏమయ్యా! శ్రీరాముడు తన బలమంతయు నీ యందిమిడ్చి రామ ముద్రిక నెందులకిచ్చినాడు నీకు శ్రీరామ బలము సంపూర్ణముగా నున్నదని నేనెరుగుదును. నీవు మారు మూల కూర్చుందువా? లేలెమ్మ! యని పొగడగా యెంతవాడవైనావు. పర్వతములు కదలినవి. వృక్షములు నిన్ను వెంబడించినవి. దేవతలు పూలవాన కురిపించిరి. అంతటి మహామహుడు నిన్ను సంసార సముద్రము దాటింపుము.

(20) దుర్గమకాజ జగతకే ఓతే!
సుగమ అనుగ్రహతుమ్హారే తేతే॥

భావము:—

గురుప్రభో! నీవు దలచిన పర్వతములు కదలును సముద్రము లింకును. భూమి; ఆకాశము కలిసిపోవును నక్షత్రములు గ్రహములు సమస్తము దొర్లుకొని నేలమీద బడును. నీ బలప్రతాపములు యెవరికి గలవు? మానవులకుగాని దేవతలకుగాని యెవరికీ స్వాధీనముగాని దుర్లభ కార్యములు నిన్ను దలంచినంతనే నెరవేరగలవు జగములన్నియు నిన్ను దలచిన సంతోషముతో నుప్పొంగిపోవును నిన్ను వ్యతిరేకించిన వారెంత వారైన నీరుగావలసినదే! భూతప్రేత, పిశాచములన్నియు జైయాంజనేయా!

మహావీరా! యని స్మరించిన మాత్రమున పటాపంచలై చెదరిపోవుట తధ్యము నీవు చేసిన చర్యలు తలచినవారు మహామహులగుదురు. నిన్ను స్మరించిన వారు యెంతటి వారగుదురో యెంతటి మహా కార్యములు దిద్దగలవారగుదురో చెప్ప జాలను ఎంతటి దుర్ఘటనలనైన నెదిరించి నిలబడగల సాహసము నీ నామమందున్నది.

నీవు సమస్తకార్యములు నీ భక్తుల సంబంధించినవి సమకూర్చు సిద్ధమూర్తివి. జగత్ప్రతాపమూర్తివని నిన్ను దేవతా గణములు మాటి మాటికి పొగడుచుండుటలేదా! నిన్ను గురించి నీ ప్రతాపము సంపూర్ణముగా వర్ణించిన వాల్మీకి యెంత ధన్యుడో! రామాయణములోని సుందరకాండమంతయు నీ మహాబలవర్ణనమేగదా! దానిని పదే పదే పారాయణముగావించినచో కాని కార్యములేదు అటువంటి చరిత్రాత్మకమూర్తివి నిన్ను నేను యీనలుబది గీతములతో నుతించుచున్నాను.

నేను రచించిన ఈ నలుబది గీతములలో సీతుహిమ సుందరకాండములోనున్నది నా చాలీసాలో నుంచి వక్కాణించినాను. నీయను గ్రహమునకై నేను నిరంతరమాశించుచున్నాను దానిని నాకు ప్రసాదింపుము.

(21) రామదుఆరె తుమరఖవారె!
హోతాన ఆజ్ఞాబినుపైసారే॥

భావము;—

హనుమద్దేవా! నీవు శ్రీరామ మందిరద్వారములో నున్న ద్వారములో నున్న ద్వారపాలకుడవు. నీ యాజ్ఞలేనిదే శ్రీరామ కటాక్షము పడదు. మున్నుని రామభక్తిని కృష్ణావతారములో ప్రదర్శించినవాడవు. ఆ నాడు ద్వారకములో బలరాముడు శ్రీకృష్ణుని యన్నగారున్నాడుగద! ఆంజనేయుడు శ్రీరాము నెరుగును కాని యీ బలరాము నెరుగడని కృష్ణుడెరుగును వెంటనే నీవు చేసిన పని నేనెరుగనా? ద్వారకలో బలరాముడన్న వాడున్నాడట. నా ప్రభువు రాముడుగా నుండ నీ బలరాముడెవడు? వాని విషయము తేల్చుకొందును. ఎల్లుండి ద్వారకానగరమునకు వచ్చుచున్నానని కబురుచేసినావు గద. ఇవి యంతయు నెరిగిన వాసుదేవుడు నీ భక్తికిమెచ్చి యిట్లు సమాధానము పంపలేదా! శ్రీరాముడు సీతాసమేతుడై ద్వారకానగరములోనున్నాడు. నిన్ను రమ్మని యాజాపించుట విన్నావు గద! సరే వచ్చెదనన్నావు.

వెంటనే వాసుదేవుడు శ్రీరాముని రూపమంది సిద్ధపడ్డాడు సత్యభామను సీతారూపము ధరించుమన్నాడు. తాను సౌందర్యవతినని యెన్నో యలంకారములు పట్టుచీరలతో నలకరించుకొని ముందునిలబడినది శ్రీకృష్ణుడు నవ్వుచూ! నీవు సీతవలె గన్పింపకపోయిన హనుమంతుడు మనతో సహితము ద్వారకా నగరమును వాలముతోనెత్తి సముద్రములో ముంచును జాగ్రత్తయన్నాడు. ప్రాణభయమంది సత్యభామ నాకు యేది వద్దని తప్పుకొనంది.

మహావేగముతోవచ్చు నీ రాక గ్రహించి వాసుదేవుడు రుక్మిణీ దేవిని సీతగా తయారవమన్నాడు పైటకొంగు మార్చి పెనిమిటి ప్రక్కసీతగా కూర్చుండ నీవు వచ్చి సీతారాములకభివాదము చేయలేదా? నీలోని రామభక్తికి జగములు కంపించిపోయినవి నీయాజ్ఞశిరస్సునధరించి సమస్తము నిలబడునని గ్రహించితిని దేవా దీవింపుము.

(22) సబసుఖలహై తుమ్హారీ శరనా!
తుమరక్షక కాహూకో డరనా॥

భావము:—

నాకు సర్వశుభములు కావలయునన్న నీ చరణములే శరణమని నమ్మెదను నీచరణములు నమ్మినవారు సంసారబాధలందరు. నీవు సర్వభక్త రక్షకుడవు. ఆనాడు సముద్రములో నీ తండ్రి సాయముతో రెక్కలు తెగ కుండా మైనాకుడు దాగియున్నాడు గద! నీ తండ్రి సాయముతో తన ప్రాణ మానరక్షణ జరిగినదన్న విశ్వాసముంచుకుని నిన్ను గౌరవించదలచి నీ యెదుటకు వచ్చి నిలబడినాడుగద! నీవు వానినిరాక్షసునిగాదలచి మోచేతిపోటు పొడువగా నీకు తన వృత్తాంతమంతయు చెప్పినాడు ఆ మాటలకు నీ వెంత పొంగిపోయితివో నిన్ను శరణము వేడుచున్నాను నీవు రామభక్త శిఖామణి వన్నాడుగద! నిన్ను శరణమనగానే నీ హృదయమెంత పొంగిపోయినదో, ఆతనికి సుఖము నీయ నెంతగా నాలోచించితివో! ఆ వేగముతో లంకను ప్రవేశించి సీతను వెదకి నిన్ను బంధించిన వారిని సంహరించి ప్రతాపము చూపలేదా?

లంకాదహనముగావించి తోక చల్లార్చుకొని యిది వరలో నభయదానము చేసిన ప్రకారము నీ యెదుట నిలబడి శరణమన్న మైనాకు

దొసగిన సత్కారములు గ్రహించివాని ననుగ్రహించలేదా? నీవు వరదానము చేయు సమర్థుడవు. నిన్నారాధించువారు యెంతటిఘనులో నీ దయయే దానిని నిరూపించును. అభయదానము చేయుటలో నీ యంతటివాడున్నాడా? ఆనాడు శ్రీరాముని సహితమెదిరించలేదా! నిన్ను శరణువేడిన రాజురామునకు శత్రువైనను వదలినావా?

రామునితో సహితము యుద్ధమునకు సిద్దపడి ప్రాణములు వదలవలసిన వదలుదునుగాని నన్నభయమువేడిన ప్రాణిని వదలనని భీకరముగా నిలబడిన ప్రతాపమూర్తివి. నేను నిన్నభయ దానమడుగుచున్నాను నీచరణములే శరణము ఇవే నా జోహారులు.

(23) ఆపదతేజ సమ్హారో ఆపై!
తీనోం లో కహాకతే ంకంపై॥

భావము;—

నీవు స్వయముగా ప్రకాశించు తేజముగలవాడవు. అగ్ని దేవుడు జ్వాలలను తనలో నిమిడ్చుకొని వాయువు తగిలిన తరువాత మంట లెగ బ్రాకించునట్లు సమయము గుర్తించి నీవు విశ్వరూపము బ్రహ్మతేజోరూపము. పూని సంచరించగలవు. నీ వద్దయోగ శక్తులన్నియుగలవు. అణువునుమించి చిన్నగానుండగలవు మహాస్వరూపముతో సంచరించగలవు. తేలికగా శరీరమును మలచగలవు మహామహిమలు నీవు చూపించగలవు ఇతరుల కదృశ్యముగా తిరుగగలవు నీ చిత్తము వచ్చిన రూపములు ధరించి నడువగలవు మూడులోకములందు కామరూపివై తిరుగాడ గలవు. నీవు యీ రకములగు రూపములు ధరించకున్న పంపాతీరమున రామునే రూపముతో

వారందరి సంగతి యట్లుంచి నాకు నారద మహామునీంద్రుడు దయతో నిన్ను గుర్తించు మార్గము చెప్పుటచే నిన్ను చూడగల్గినాను. నీవు ముసలి బ్రాహ్మణ రూపముతో రామాయణము వినలేదా? నేను వెంటబడ నన్ను కసరి నాకందకుండా చరించలేదా? నీ దయ నా మీదపడినది గాన నన్ననుగ్రహించితివి. ముల్లోకములలో సంచరించు సమస్త జీవీస్వరూపా! వాయునందనా! నివు హుంకరించితివా పదునాల్గు భువనములు దద్దరిల్లిపోవా? నీ పేరు విన్న, నీ రూపము స్మరించినా శత్రువుల గుండెలదరిపోయి ప్రాణవాయువులు లేచిపోవుననుటలో సందియములేదు.

పవమాననందనా! ఆంజనేయస్వామీ! భక్తరక్షకంకణధారీ! యివే నా నమోవాకములు, నా ప్రణామములు. గురుదేవా! నీవు మహాగర్జా నాదమువదలి భక్తులకు శ్రవణ సుఖముగా మంచిచెడ్డలు విచారించి చెప్పుము. నిన్నువదలినవా డవివేకుడు మూఢుడు జయీభవ! గురుమూర్తీ! నమో నమః.

(24) భూతపిశాచనికటనహిం ఆవై।
మహావీరజబనామ సునావై॥

భావము:—

నీవున్నచోట భూతప్రేత పిశాచములుండ నేరవు. నీ పేరు చెప్పినచో గడగడలాడిపోవును. అవి యన్నియు యెందులకు? నీవు సూక్ష్మరూపముతో సంచరించబోయిన సమయములో లంకిణి యెట్లు గ్రహించినది? బ్రహ్మదేవుడు లంకిణిని సృజించినప్పుడు యది బ్రహ్మను చూచి నన్ను యెందులకు సృజించితివని ప్రశ్నించెను నా వంశీయుడు రావణుని పట్టణము లంకానగరమునకు కోటకావలివై యుండుము. నిన్ను యెవడు జయించలేడు,

దేవతలుగాని యక్షరాక్షసులు గాని భూతాదులు గాని నిన్ను జయించజాలవు. నీకుయెవ్వరడ్డు చెప్పజాలరు. మహాభూతమువై యందుండమనెను. ఆమెవిని నాకడ్డు చెప్పువారులేరా? యటువంటి బలము నాకిచ్చినావా? నేనెంతకాలము యీ బలముతో నుందును? ఎవరివలన నేను జయింపబడుదును చెప్పుమన లేదా? అదివిని యాతడు వినుము నిన్ను జయించు వాడెవడో చెప్పెదనని యిట్లనెను.

శ్రీరామకార్యార్థము మహావీరుడగు వానరమూర్తి నిన్ను చూడ కుండా లంకానగర ప్రాకారము దాటుచుండ నీవడ్డుపడెదవు. ఆతడు నీ బల మును పట్టించుకొనడు. నిన్ను మించిన బలవంతుడు. నీ వాతని చేతిలో పరాభవమందెదవు. నాటినుండి లంకానగరమునకు విచ్ఛిత్తి వచ్చునని చెప్పి పంపెను. ఆమె యట్లు కోటకావలి శక్తియై యెంతో కాలముండగా సీతా విషయమున నీవు సూక్ష్మరూపముతో ప్రాకారము దాటుచుండ నిన్నెదిరించిన లంకిణీ మహాశక్తిని ప్రహరించి యోడించినావు.

అంతటి మహాశక్తి నెదిరించి జయించిన వీరమూర్తీ! భూతప్రేతా దులు తొలగుటన్న యచ్చెరువు లేదు నీ నామము పరమశుభమై కీర్తిపొంది నది. దానిని జపించిన వారు పొందరాని మహావైభవములు యుత్తమలోకము లుండవు సర్వదుష్టభూత భయంకర మూర్తీ! గురుమూర్తీ! వందనము.

(25) నాసైరోగహరై సబపీర।
జపతనిరంతర హనుమతవీరా॥

భావము:—

నీ నామము గొప్ప రసాయనము. దానినిజపించువారి కేరోగములు రానేరావు. ఏ బాధలు చెందనీయని శక్తి యందున్నది నీ సర్వరోగహరమగు మహౌషధము. నేను నిరంతరము పానము చేయుచుందును. నాలోని హృదయ

తాపములు, రోగములు, మనశ్చాంచల్యము, భూతప్రేతాది బాధలు, సర్వ పీడలు సమసిపోగొట్టిన మహానుభావుడవు. నిరంతర జపతపములతో నిండిన మహావీరా! వాయుకుమారా! సమస్తపాపములు విదలించుకొన్న పుణ్యమూర్తీ! నీవు నా యిలవేలుపువు. నీ ధ్యానముద్ర నెవరు వర్ణింతురు. వృద్ధవానర మూర్తివైయుండు గుహాంతరములోనిల్చి జపము చేయుచు బ్రహ్మతేజము కోటి సూర్య ప్రకాశమానముగా నింపుచుండు మహాయోగివి. జయ వానర వీరా! దివ్యశరీరా! మంగళాకారా! సర్వాధారా! ప్రతాపసంచారా! యని యనేక విధముల దేవగణములు వినుతించుచుండ నిశ్చల సమాధిలో శ్రీరామ పర బ్రహ్మము దర్శించుచుందువు.

ఓ హనుమద్వీరా! నిన్ను వానరవీరులుసీతాన్వేషణ కార్యములో సముద్రము దాటుట కశక్తులయి దిగాలుపడిన సమయములో నీవు వారి విష యమే పట్టించుకొనలేదు. వారికి దూరముగా నుండి శ్రీరామ పరబ్రహ్మము ధ్యానించుచు నిలబడిపోలేదా? నీకు లోకవ్యవహారములుయేవియు నంటవు. నిర్గుణమూర్తివి. నిత్య సంతోష స్వరూపుడవు.నీ విషయము సాంతముగా నెరి గిన జాంబవంతుడు మాత్రమే నిన్ను ధ్యానము నుండి లేపినాడు. అప్పుడు కన్నుదెరచినావు. హుంకరించినావు. మహా గర్జ్యారామ గావించినావు.

నాయంత వాడెవడు? యీ సముద్రముగాదు సప్త సముద్రములు దాటుదునని నిన్ను నీ బలమును పొగడగా విజృంభించి బయలుదేరలేదా? అట్టి జపతప నిష్టామూర్తివి. జగద్బంధువుడవు లోక ప్రాణమూర్తివి. నిత్య మంగళమూర్తీ! నన్ను చేపట్టుము.

(26) సంకటతే హనుమానచుడావై।

మనక్రమ వచనధ్యాన జోలావై॥

భావము:—

హనుమాన్ దేవా! నీవు సమస్త సంకటములు పోగొట్టగలశక్తివంతుడవు. నీవున్న చోట బాధలుండవు. నిన్ను స్మరించిన మానసిక శాంతి వచ్చును. క్రమముగా మనస్సు సంచరించును. యితరములగునాలోచనములు పుట్టనీయవు జగమునకు ముఖ్యప్రాణమవగు నిన్ను స్మరించెదను క్రమముగా జపము ధ్యానము స్వరము నీ వలన గల్గి జీవులు తరింతురు. నీవు రామప్రభు సేనాపరుడవు. శ్రీరాముడు సామాన్యుడా! ఆయన రాజవంశము వారికెల్ల కిరీటమువంటివాడు. ఎందరు రాజవరులు సీతా స్వయంవరమునకు వచ్చినారు? శివుని విల్లు నెవరు కదపగల్గినారు? వారందరు తెల్లమొగము వేసినారు గద! ఏనుగు గున్న వలె రాజకుమార వేషము ధరించిన నీ రామప్రభువు విశ్వామిత్రు ననుజ్ఞగొని వేచినాడు ఏనుగు తన తొండముతో చెరకు కర్రనుపట్టి విరచినట్లు యేనుగు తొండమువంటి హస్తమును సాచి యీ విల్లందుకొని దానిని ఖండించలేదా? నీ ప్రభువు యానాడే రాజ కిరీటముగానున్నాడు.

నీ రామప్రభువు పాదరజము యెంతటి మహిమగలది యోగదా! గౌతమాశ్రమములో చట్రాయిగా నున్న యహల్యాదేవిని నిజస్వరూపిణిగా చేయలేదా? ఆనాడరణ్య వాసము చేయబోవు వేళలో గంగను దాటించగుహుడు భక్తితో నేమన్నాడు. రామా! నీ పాదరజములో మాయయున్నది రాతిని నాతిగా చేయుగారడీవాడవు. నీ పాదములు కడుగకుండా నాతనెక్కనీయనన్నాడు. అటువంటి రామునికి దూతవు.

మీరు తలచుకొన్న సమకూరనిది లేదు. మనస్సు వచనము క్రియ యనగా త్రికరణశుద్ధిగా నమ్మి లనుంచగల శక్తివంతుడవు. నీవు సర్వకామములు తీర్చెడి కల్పవృక్షమువంటివాడవు నీ ప్రతాపము నేను వేయి విధముల నుతించెదను.

[27] సబపరరామ తపస్వీరాజా।
తినకే కాజసకలతుమ సాజా॥

భావము:—

రామరాజ్యము వంటిది యున్నదా? శ్రీరాముని పట్టాభిషేకములో నెందరకు యెన్ని బహుమానములిచ్చినాడు నీకుయే బహుమతియు నీయలేదు. నీ గుణమాయన యెరుగును. రాజులకెల్ల కిరీటముగా నున్న రామచంద్రుడు నిన్ను యెందులకు వదలినాడు నీవు విరాగివి నిస్సంగివి. లోకవిషయములను పట్టించుకొననివాడవని యెరుగును ఆయన మునులకు ప్రభువు వారిహృదయములలో సదా నివాసము చేయుచుండును. అట్టి రామచంద్రుడు మునీంద్రుల హృదయములకాహ్లాదము గల్గించు చంద్రుని వంటి శీతల మూర్తియై వెల్గొందును మునీంద్రులన నెవరు? వారు తనువు, ధన, మాన, ప్రాణములు సమస్తము వదలిశరీరమునకు నే భోగములాశించని మనోనిగ్రహముతో యోగముద్రలోనుండు వారుగదా! వారికి శరణ్యము రామప్రభువు వారి జీవనము రామనామ జపము. వారిమనుగడ శ్రీరామ పాదపద్మముల సన్నిధిలోనని యందరెరుగుదురు.

అట్టి రామ కటాక్షమందినవారిలో నీ కన్నమిన్నయొకడులేడు లేడని సమస్త ప్రపంచము మారు మ్రోగుచున్నది. నీ దయలేకున్న శ్రీరాముని దయరాదని యెరిగి నిన్ను ధ్యానముచేసిన కృపతో స్వామిని దర్శించెదరు. నన్ను నీవట్లుగానించిన ధర్మదాతవు. నీవేనాగురుడవు,నాతల్లివి, తండ్రివి, దాతవు సమస్తము నీవని నమ్మియున్నాను. సమస్త దుఃఖములు పోగొట్టు మహనీయమంత్రమూర్తివి. వాయు నందనా నీవు నా ప్రాణమవు.

నీవు రామజపతపములో మున్గితేలుచుందువు. ప్రభు పరిచర్య నీకు రమావధి. అందులకే నిన్ను రామదాసుడనియు. శ్రీరామదూత వనియు శ్రీరామ కార్యధురంధరుడవనియు, బహువిధములుగా కీర్తింతురు, స్వామీ! న్ను పొగడజాలని నాయశక్తిని తొలగించుము.

[28] ఔర మనోరథజోకోయిలావై।
సోయి అమిత జీవన ఫలపావై।

ావము:—

ఓ కేసరీ నందనా! నీవు మనోరథములు తీర్చుటయందు సామ ్యముగలవాడవు ఎందరిని యెన్ని విధముల కాపాడినది నీ భక్తులకే తెలి యును జీవులందరు వాంఛలతోనుందురు కొందరు రోగవిముక్తి. కొందరు క్తి, కొందరు యిండ్లు వాకిళ్ళు. కొందరు సంతానము, రోగవిముక్తి. కొం రు భక్తి. కొందరు ప్రభుత్వము కొందరు విరాగము, కొందరు రామసేవ ొందరు భూతప్రేత పిశాచ బాధా నివారణము మొదలుగా నెన్నియో యెం రో తమ మనోరథములు నీకు విన్పించుచు తీర్చగా వేడు కొందరు. నీవు ారి భక్తి కొనసందించి వారి మనోరథములు తీర్చుమహానుభావుడవు. నిన్ను ించిన ఫలదాత మరొకరులేరు నీవభయమిచ్చుటలో జంక. శంకలేనట్టి హాధైర్యశాలివి నిన్ను స్మరించినవారికి బుద్ధిబలము పెరుగును. మహా నీషులగుదురు శరీరములలో రోగములంటకుండా బలము నొసగికాపాడు లశాలివి. నిన్నారాధించిన వారికి యశస్సు పెరుగును. అనగా జగములో ారంతటివారు లేరు వారికెదురాడ రాదని యనిపింతువు.

నీవు నీ భక్తులనావేశించి వారిని సర్వశక్తివంతులుగా చేయుదువు న్ను పాసించినవారు నిర్భయులైయుందురు వారికి శరీర భయముగాని.

యమ భయముగాని, దరిద్ర భయముగాని యే భయములుదాటికి రానీయవు శరీరరోగములు వాతపిత్తశ్లేషాదుల వలన వచ్చినవి. మానసికముగా కామ క్రోధాదుల వలన వచ్చినవి యనగా పైరోగములు. లోపలి రోగములు సమస్తము నివారించగల దివ్య నామము ధరించిన ప్రభుడవు.

మందబుద్ధిని తగ్గించి చురుకు తనము, నేర్పు, ధర్మముగల వాగ్బల మిచ్చువాడవు నిన్ను పాసించినవాడు యే యక్షర జ్ఞానము లేకున్నను మహామహులతో సమానముగా నిల్వగలవాడగును. నీ చేతిలో ముక్తియున్నది. నీ నామములో భక్తి వెల్గుచుండును. ఫలదాతా! నీకు మ్రొక్కెదను.

[29] చారోంయుగ పరతాపతుమ్హారా।
హైపర సిద్ధజగత ఉజియారా॥

భావము:—

మూడులోకములకు నిత్యము యోగము క్షేమము గల్గించు ఫల వృక్షమవు. అందరకు సుఖ ఫలములునిచ్చు కల్పవృక్షము, చింతామణి, పారిజాతముగా విలసిల్లుచున్నావు. నీ హస్తములలో సిరితాండవించును. నీ దృష్టితో బ్రహ్మతేజము భక్తులకు గల్గును. నీ శరీరకాంతితో నిర్మలయోగధ్యానమువచ్చును. నీ పాదఘట్టనమునతో భూమ్యాకాశములదరి పోవును. నీ విశ్వరూపములో సృష్టియంతయు నిండియుండును. నీయుదరము బ్రహ్మాండమునకు నిలయము. నీవాలాగ్రమున ప్రకృతి నిలబడియుండును యుగ

తోడుపడుచుందువు శ్రీరామచంద్రప్రభువు నీయందు తారకమంత్రజప ఫలము ద్వారా ప్రవేశించి నిన్నింతవానినిగా చేసినాడు.

నీ బలమంతయు తారకమంత్ర బలము నీ శరీరమంతయు రోమ రోమ కూపముల ద్వారా ప్రణవనాదముతో తారకము ప్రతిధ్వనించు చుం డును నీవు తారకమంత్రనాదముతో శరీరధారివిగాని నిజము పరబ్రహ్మ తేజో మయుడవు లోకములను సన్మార్గములో నడుపుటకు వారికాదర్శ జీవితము గడపుటకు యీ వేషము ధరించినావు.

నీలో స్వసిద్ధులు గలవు. నీయంతట నీవు రోమరోమ కూపము నుండి కోటాను కోట్లు వానరవీరులను బయట పెట్టగలవు అవసరసమయము లందు సౌమ్యరూపము, భీకరరూపము రెండును చూపగల సమర్థుడవు. నీకు కామచారిత్వము. సర్వలోకసంచార సమర్థత్వము నీ తండ్రి వాయుదేవునకు న్నట్లు నీకున్నవి. పరసిద్ధికై నిన్ను జగములర్చించుచుండును.

[30] సాధుసంత కేతుమ్ రఖవారే।
అసురని కందన రామదులారే॥

భావము:—

సాధుసమాజమును రక్షించి కంకణము దాల్చిన ధీబలశాలివి. సాధుజనులకు సంజీవి వంటివాడవు. నీ చరిత్ర పఠించినవారలు నీ యద్భుత శక్తులు తరచి చూడగలరు శ్రీరామ భక్తాగ్రేసుడగు విభీషణుని శరణాగతి గమనించి సాధువులకు నీ స్నేహ సహకారములు వెల్లడికాగలవు వారందరు రావణుని తమ్ముడు రాక్షసుడు మనకు శత్రుడని చెప్పి శ్రీరాముని చేత ధనుస్సు నెక్కుడ జేయగా నీవు వారించలేదా? విభీషణుని విషయము లంకా నగరములో నీవు చూచినది విన్నది వివరించలేదా నిశాసమయములో మహా

శత్రుపట్టణ మధ్యములో ప్రబల రాజ విరోధియగు రామనామ సంకీర్తన గావించు పుణ్యాత్ముడు విభీషణుడని చాటిచెప్పి వాని కభయమిప్పించ లేదా?

నీవు సాధువులకు పక్షపాతము చూపింతువు రామభజనానురక్తులకు తోడుగా నుందువు నీ భక్తి బృందమును నిరంతరమావేశించి యుందువు వారి కార్యములు ఫలప్రదములుగా చేయుదువు రామరసాయ నీపానసిద్ధుడవు. మారుతీ! నీకడ్డు గలదా? జగదేక బంధుసముద్రుడవు దయాశాలివి ధర్మ రక్షకుడు సర్వబాధా నివారకుడవు నిన్నాశ్రయించిన వారెంతటియల్పులైనను పాపులైనను క్షమింపరాని నేరములు చేసిన వారైనను దయతో బ్రోచెదవు ధర్మమయమూర్తీ! వానర రూప బ్రహ్మతేజా! జోహారు.

ఇంతటి భక్తుల నెట్లాదరించెదవూ దుష్టగుణములు గల వారై, లోక భయం కరులై, గర్వముతో తిరుగాడు దుష్టులు రాక్షస గణమును చీల్చి చెండాడుటలో వెనుకాడవు. శ్రీరామపాదాశ్రయము లేని దుర్గుణులను శిక్షించుట సమవర్తియై నయముడు నీకు సాటిరాడు గురుదేవా! నా పుణ్యముచే నిన్నాశ్రయించ గల్గితిని.

(31) అష్టసిద్ధి నౌనిధి కేదాతా!
అసవ రదీన జానకీమాతా॥

భావము:—

మహా ప్రభూ! గురుదేవోత్తమా! నీవు అష్టసిద్ధులు నను గ్రహించ గల నెఱదాతవు. అనగా నీవు యోగాధిష్టానదేవతవు యోగ మనగా నీవు పూర్తిగానెరుగుదువు. ప్రాణాయామము ముందు గావించుచు నిన్ను స్మరింపవలయును ఆ వాయువును యిదా పింగళానాడుల ద్వారా

గ్రహించుట విడుచుట వాయువును కుంభించుట మొదలగు వాయుని గ్రహ చర్యలతో క్రమముగా మూలాధార చక్రమందు ముందున్న కుండలి నీ శక్తిని లేపవలయును. అనగా యది పాము చుట్టవలె చుట్టుకొని యుండును. వాయువునుకుంభించెడి యభ్యాసములోనా నాడికదలును. దాని ముఖము మూలాధార చక్రమువైపున నుండును. అది వాయువు కుంభించగా యోగి మూలముగా సుషుమ్నానాడియను నాళముగుద స్థానము నుండి శిరస్సులో నున్న సహస్రారము వరకు వ్యాపించి యుండును. దానిని కదుపగా నది యా నాళములోనికి పోవుచు వెలికివచ్చును సాగుచుండును అట్లానాడియందు యీ కుండలి శక్తి స్థిరముగా పోవలయును.

అది మధ్యనున్న చక్రముల యందాగుచు పోవుట అభ్యాసముతో నలవడును ఆ విధముగా యోగ గమనము తోడపట్టిన వష్టసిద్ధులు. అనగా అణిమ, గరిమ, లయిమ, యిటువంటివన్ని యుపుట్టగలవు అట్లు యెనిమిది రకముల సిద్ధులు గల్గుటకు నీ సేవాభాగ్యమే కారణము నీవు వాటిని శక్తు నికీయగల సమర్ధుడవు నవ నిధులు కుబేరుని వద్దనున్నవి. ఆ నవ నిధులు నీదయవలన గల్గును.

నీవు దయతలచినచో కుబేరునంత వానినిగా చేయు మహాదాతవు మహాలక్ష్మి దేవతయగు సీతా మృతమను ఫలమునుగ్రహించిన శక్తివంతు డవు. నీకు వేనవేలు జోహారులు.

[32] రామరసాయ నతుమ తేపాసా।

సదారహో రఘుపతి కేదాసా॥

భావము:—

ఓ రామదాస మహాశయా! దీనబంధూ! నిన్ను మొదట నేనెరుగను నేనజ్ఞానముతో నున్న సమయములో నన్నుద్ధరించుటకు నీవు యెటువంటి సన్నివేశము గల్పించినావు. అది యంతయు నీ దయ నా భార్యయే మంత సమర్థురాలు. నాకు రామచంద్ర సేవాఫలము దక్కించుటకు శ్రీరామ దర్శనము చేయకుండా రావలదు. ఈ శరీరము యెప్పుడో యొకప్పుడు పోవలసి నదే! దీనిని గురించి యింత వెఱ్ఱిప్రేమ పెట్టుకొని ప్రాణములకు తెగించి నేనర్థరాత్రమున పోవ నన్ను యెంతగా మదలించినదో! ఆనాటి యామె యావేశమంతయు నీవా వహించి చేసినదని యీనాటికి గ్రహించినాను. నీవు సర్వవ్యాపకుడువు అందరి హృదయములలో నీవు నిండి యున్నావుగాన యింత ప్రభావము నా మీద ప్రసరింపజేసినావు నేనెక్కడ? రామనామ జపమెక్కడ? ఆ జపతీర్థ మహిమ యెక్కడ? మహాభూతము నన్ను దయదలచి నారదాగమనము చెప్పుటెక్కడ?

ఆ మహానుభావుడు నాకు తారకమంత్రోపశము చేయక జగదురుడవగు నీ విషయము నాకు సంజ్ఞగా చెప్పుటెక్కడ? ఎన్ని చిత్రములు! నా జీవితమన్ని విధముల మరిచి నీ పాదసేవ చేయగల శక్తిని ప్రసాదించిన దేవతామూర్తివి. నిజముగా నేను యెంత ధన్యుడనో తెలియలేకుండా యున్నాను నీవు యెవరని భావించుచున్నానో తెలియునా? ఆంజనేయస్వామివని గాదు నీవు శ్రీరామ నామమధురసము తొణికిసలాడు భాండమవు.

నీవు కదిలిన మెదలిన దర్శనమిచ్చిన దయదలచిన రామరసాయనము తెరటములు కొట్టును నీవు బహుశ్రద్ధ కల్గిన రామసేవా పరుడవు. వర్ణింప నా తరముగాదు. జగదాధారుడవు గురుదేవా! యివే నా నమస్కార

(33) తుమ్హారే భజన రామకోపావై
జన్మజన్మకే దుఃఖబి సరావై

భావము:—

ఓ మారుతీ! మహాభక్త శిఖామణీ! గురుదేవగా మణీ! నా యనేక వందనములు స్వీకరించుము. నిన్ను యెవరు భజింతురో వారు రామ ప్రసాదమునకుతగినవారని వేదశాస్త్రములు ఘోషిల్లుచున్నవి. నిన్ను సంతసముతో భజించువారలే రామకటాక్షము పొందనర్హులగుదురు రామదర్శనమందిర ద్వారము ప్రవేశించుటకు నీ యనుజ్ఞ తప్ప యింకొక దారియున్నదా? నిన్ను శ్రద్ధాభక్తులతో భజనసేయువారలు యే సుగతులు పొందుసురో. నీవు పొంద జేయుదువూ నీకే తెలియును. నేను చెప్పుట కెంతవాడను జగదభిరాముడైన రాముడు తన్ను భజించమనడు నా భక్తుడైన హనుమంతు నారాధించిన వారు నా లోకమునకు వత్తురు. నా హనుమద్భక్తుడు యింటికి సింహద్వారమువంటి వాడనినాడు. అందుకే సమస్త లోకములు జైవాయునందనా! జై మారుతీజై పవమానదెగవంతా! హనుమంతా! యని కీర్తింతురు.

ఆ కీర్తనతో భూలోకమందలి భూతకాలము యెగిరి గంతులు వేయును. ఏ జీవులైనను యనగా యల్ప శరీర ధారులైనను. ఘన శరీరధారులైన చీమ మొదలు సిద్ద పురుషులవరకు నీ నామములు స్మరించినను వినినను మోక్షము సిద్ధించును అనేక జన్మలనుండి చేసిన పాపము లీ విధమగు భజనలతో ని సేవతో నశించును ఉత్తమ గతి ప్రాప్తించును.

జన్మ జన్మలకు దుఃఖమను మాట వినిపించదు అనగా నీవు. నీ నామము. నీ భక్తి సర్వశక్తుల ప్రసాదించి నిత్యానందము గల్పించును సదా శుభములు ఘటించును ఎన్ని జన్మలకైన నీ పాదసేవ నాకు గల్పించి దయతో నీలో జేర్చుకొనుము.

(34) అంతకాల రఘుపతి పురజాయీ!
జహాఁజన్మహరి భక్తకహాయీ॥

భావము:—

శ్రీహరిభక్తులు యెందును బాధపడరు రోగములంటవు విచారములు దూరములగును. సంసార బంధనములు విడిపోవును. ఎందరెందరో మాహాభక్తులు విమానముల మీద శ్రీహరి నివాసముజేరినారని యెన్నో కథలున్నవి. శ్రీరామప్రభువునకు ధన, బల, సంపదలాది విషయము పట్టింపునకురావు వారు పెట్టుని వేదనల విషయము చవిగొనడు ఒక్కబడుగు అంగ వికలుడు మతిస్థిమితములేనివాడు, బధిరుడు, గ్రుడ్డి, కుంటియను భేదము లెన్నడు జాతిమతములు పాటించడు. ఆయన పాటించునది హృదయము మాత్రమే. అందులోనున్న భక్తి విషయమే. నీవురామ ప్రభుని ప్రధానదాసుడవు. నీవుకూడ దానినే గమనించెదవు ఈ జన్మమంతయు హరి భక్తితో గడపిన వారుగాని, హరి భక్తులు పరిచర్యలు చేయువారుగాని హరి నామ గావించు వారుగాని వారెవ్వరైనగాని, యంత్య కాలమములో హరినామము స్మరించుచు శరీరములు వదలిన వారుగాని శ్రీహరి నివాసమునకు నీవు పంపుదుముందురు. నీకు సమస్తము తెలియును.

శబరియే జాతిది? ఏ భక్తి ననుసరించినది? ఎట్లు కాలము జరిపినది? మునీంద్రులకు పరిచర్య చేయుచు రామభక్తి సంపాదించుకొనలేదా? వారి పరిచర్యతో భక్తిదీపము వెల్గించుకొనలేదా? మునుల హృదయముల కామె సంతోష కారణముగాలేదా? వారు శరీరములు యోగ మార్గమున వదలి పోవుచుండనన్ను మీతోగొని పొందని ప్రార్థించలేదా? వారు చెప్పి సమాధానమేమి శబరీ! శ్రీరామునిగా శ్రీహరి యవతారమెత్తెను.

ఆయన నీ వద్దకు వచ్చును ఆయన కాతిథ్యమిచ్చి పూజించిన తరింతువనియాపు చేసిరి రామునకు రుచిగల ఫలములు తాను రుచి చూచి దాచి యుంచి సత్కారముగావించి విందుచేసినది ముక్తిపొందినది శ్రీహరి భక్తులకు వైకుంఠ ప్రవేశము సులభమగును అది నీ భక్తి మహిమగా నెరిగితిని.

(35) ఔరదేవతా చింతన ధరయీ।
హనుమత సేయి సర్వ సుఖకరయీ॥

భావము:—

లోకములందు యెందరెందరో దేవతలుగలరు కొందరు క్షుద్రదేవతలను, కొందరు స్వర్గవాసదేవతలను, కొందరు యక్షగంధర్వ దేవతలను, కొంతమంది భూత, ప్రేత, పిశాచ గ్రహాదులను, కొంతమంది కామినీ శక్తులను, కొంతమంది మారక శక్తులను వివిధములుగా నర్చింతురు, కొందరు గణపతిని, కొంతమంది కుమారస్వామిని, కొందరు శివుని, కొంతమంది దుర్గను, కొందరు కాళిక, వారాహి మొదలగు శక్తుల నర్చించుచుందురు వారు యెంత యత్నముచేసినను యెట్లు పూజించినను సంపూర్ణమోక్షము నీయజాలరు. అవి యన్నియు తాత్కాలిక ప్రయోజనముల కుపయోగించును వారు చూపిన భక్తికి మెచ్చి దివ్య శరీరము లెవరీయగలరు? వారి కాలమంతయు వృథాగా పోవుటగాని ఫలితము నీయజాలవుగదా!

నీవే సమస్త దేవతా స్వరూపమువాడు ఏ రూపము కావలయునని నిన్ను పూజించిన యారూపముతో వారికి దర్శనమిచ్చి కోర్కెలు తీర్చెదను నిన్ను పవమాన సుతునిగా భావించిన వారికట్లే ప్రసన్నమగుదువు గురు దేవుడవని కొల్చిన వారి కుపదేశము చేయుదువు నీవు విశ్వరూపుడవని భావిం

చిన నీ విశ్వరూపము చూపి సీతాదేవి కానందము గల్పించలేదా? అణు రూపమునంది లంకాపురము తిరుగలేదా? నిన్ను భక్తితో సేవించినవారు యెంత బలవంతులగుదురో గద! నీ వలన సమస్త సుఖములు వచ్చును.

సకల సుఖదాయివని నిన్నందందురుగదా! మహాప్రేమమూర్తివని నిన్ను భరతాదులునుతించలేదా! తనకు ప్రాణము వంటివాడువనియు పుత్ర సమానుడవని సీతాదేవి శ్రీరామునితో పలుకలేదా! అందుచే హనుమంతుని సేవ సకల సుఖములిచ్చునని దేవతాకోటులు భావించి సేవించుచుందురుగదా! నన్ను దయతో చూడుము.

[36] సంకట హటై మిటై సబపీరా!
జోసుమిరై హనుమత బలవీరా॥

భావము:—

ఎల్లకాలము వాయునందనుని సేవించినవారికి యే విధమగుబాధలు దరికిరావు. ఓ బలవంతా! హనుమంతా! మహావీరా! యని యెవరానందముతో నిత్యము నిన్ను గానము చేయుదురో వారి బాధలు క్షణములో మాయమగును. వారు బలవంతులగుదురు. ధనవంతులగుదురు. విద్యావంతులగుదురు. రూప. గుణ సంపదలు గలవారగుదురు. నీ మహా శక్తులన్నియు వారి యందు ప్రతి ఫలించును వీరాధి వీరులై కీర్తివంతులై, తత్వజ్ఞానముతో ప్రకాశించు వారలై శోభించెదరు.

నీ చరిత్రము జననమాదిగా చివరవరకు యెవరాసక్తితో విందురో చదువుదురో, ని రామ భక్తి ప్రభావము గగుఱు పొడిచిన శరీరములతో సంతోషముగానూహింతురో, నిన్ను తలచిన మహిమలు పొగడి. నిన్ను

సకల దేవతా రూపునిగా భావించి నీయనుగ్రహము సంపాదింప యత్నింతురో వారందరూ బంధువులే. నిన్ను బట్టి నాకు కల్గిన చుట్టరికముగావారి నాప్యాయముగా గౌరవించి సేవించెదను.

ఎవడు జై హనుమంతా! బలవీరా! యని యావేశముతో నిల్చి గంతులేయునోనాని నావేశించి వానిచే త్రికాల విషయములు పల్కించెదవు వాని వాగ్బలము, బుద్ధిబలము, మంత్రబలము. సమస్తము నీవైయుండెదవు నీవు సమస్త మునులచేనుతింపబడు వాడవని నేనెరుగుదును. నిన్నువారు శ్రీరాముని సన్నిధానము జేర్చుటకు మిక్కిలిగా నాశ్రయింతురు. వారిని దయతో నెల్లవేళల కాపాడుచుండు ప్రత్యక్ష దైవమవు నాకు సుఖదాయివై యుండి గమ్యము చేర్పుము.

(37) జై. జై. జై హనుమాన్ గోసాయీ,
కృపాకరో గురుదేవ కీనాయీ॥

భావము:—

జయ! జయ! జయ! హనుమాన్ గురుదేవా!
టయ! జయ! జయ! జయ! హేబలవీరా!
జయ! జయ! జయ! జయ! కృపాకరో
జయ! జయ! జయ! జయ! నమో! నమో॥

మహాప్రభూ! నిన్ను నేను యిట్లు సంతతము గానము చేయుదును. ఎవరు నిన్ను సంస్తవము చేయుదురో వారు నీ దయకు పాత్రులగుదురు. నిన్నెరుగని వారు లేరు. శ్రీరామ నిలయములందు ముందు నిన్ను నిలుపని

యూరు లేదు. నీ నామము తమ సంతానములకు పెట్టి యానందించు దంప తులు ధన్యులు. పరమశివా! నీ మంగళరూప ధ్యానము, నీ మంగళ నామ గానము, నీ మంగళ బల, సాహస కార్యాచరణము తలచి తలచి మురిసి పోవని హృదయము పాషాణ మనదగును.

(38) జో శతవార పాఠకర్ కోయీ।
చూటహీ బంది మహా సుఖహోయీ॥

భావము;—

ఎవరు ఈ "హనుమాన్ చాలీసా" ప్రబంధమును ప్రతి దినము నూరు మారులు పాఠము గావింతురో వారు ప్రతిభావంతు లగుదురు. మాన్యు లగుదురు, పూజనీయ స్థానము లందెదరు. ధన బలము, ధాన్య బలము, సంతాన బలము, గృహారామబలము మొదలుగా సమస్తము గల్గి సుఖ సంతోషములందగలరు. వారికి బంధ మోచనమగును. అనగా దుఃఖములు అహంకారములు మమకారము లుండనేరవు. నిగ్రహముగా నుండి నీ దివ్య తేజ మును నిత్యము దర్శించుచు శాశ్వతానందము లందగలరు. ఇందులో నంత శక్తి నిన్ను పొగడిన విధానముగా వ్యక్తమగును.

సమస్త దుఃఖ హేతువగు సంసారములో నున్నవారుకూడ దాని యందుండు దుఃఖములు పొందక నీ బ్రహ్మతేజమును దర్శించుచు నిర్మల మనస్సులతో నిగ్రహముగా వర్తించగలరు. ఇంతటి మహిమ చరిత్రమందు న్నది. ఇది నమ్మదగిన విషయము. దేవగణములే నిన్ను పూజించి తరించు

చుండ మర్త్యలోక వాసులు నీ భక్తివలన వచ్చు సుఖములు పొందుదు రను టలో సందేహము రవంతయు లేదు.

(39) జోయహపడై హనుమాన్ చాలీసా!
హోయసిద్ధి సాఖీ గౌరీసా॥

భావము:—

ఈ ఎవడు మహాభక్తితో, విశ్వాసముతో, సంతోష ప్రధానముగా యీ హనుమాన్ చాలీసా పఠించునో, నూరు మార్లు ప్రతిదినము పారాయణ చేయునో, రోజునకు నూరుమార్లు చొప్పున మండలము రోజులు అనగా నలుబది రోజులు దీక్షగా పఠించి సేవించునో వారి వారి భక్తి విధానముగా బహుసుఖములగు ఫలితము లందుదురు.

దీని యందంత మహిమ యున్నదా? యన్న సంశయ మక్కర లేదు. రామనామ మంత్రమును జపించుచు సర్వసిద్ధి దాయకమై, అష్టయిశ్వ ర్యములు గల్గి భక్తులకిచ్చుచు పార్వతీదేవికి శ్రీరామ తారకమంత్ర మహిమ నిత్యము వర్ణించుచుండు యా కైలాస నిలయుడు, గౌరీ సమేతుడు సమస్త ప్రమథగణ యుతుడగు శంకరుడు సాక్షిగా సిద్ధించును సుమా.

40. తులసీదాస సదాహరిచేరా!
కీజై నాథ హృదయ మహాదేరా!

భావము:—

మహా హరిభక్తుడు. సదా రామసేవా ధురంధురుడు వాయు నందనునకు ప్రియ శిష్యుడు. పావనివలన శ్రీరామదర్శన భాగ్య మందినవాడు సమస్త సుఖములు హనుమంతు గురుదేవునియందు నిత్యము చూచువాడు గురుభక్తి పూర్ణుడు నగు యీ తులసీదాసు దయామయమగు హృదయము గల నీ పదభక్తితో రచించినాడు. నీవు నా భక్తిని గ్రహించి నా హృదయములో నిత్య నివాసము చేయగోరెదను. నా మనవి నా కర్ణించి నన్ను దయదలచి వీడకుండా నా కుత్సాహము గల్పించమని యీ తులసీదాసు ప్రార్థించుచున్నాడు.

జై వీరహనుమాన్!

జై! భజరంగబలీ!

జై! రామప్రతాపతేజా!

జై! భక్తకల్పభూజా!

జయీభవ! దిగ్విజయీభవ !!

# మంగళ హారతి

దోహా:

పవన తనయ సంకటహారన
మంగళ మూరితి రూప్
రామ లఖన సీతా సహిత
హృదయ బసహుసురభూప్॥

భావము:

పరమ పవిత్ర! వాయునందనా!
సమస్త బాధలు హరించు! మారుతీ!
రామలక్ష్మణ సీతా సమేతా!
హృదయ మందిర సంస్థాపక! ధీరా!
ప్రేమ చూపుమా! వదలకుమా! హనుమా!
మంగళహారతి గొనుమా! ప్రభువా!

దుష్ట సంహారా రామతుహన
కృపతో జూడుము జపము చేయుదును
సంకటహరణ శ్రీరామ శరణా!
హాయి నొసగు మంగళ హారతి గొనుమ!!

